# అదృష్టదీపిక

1957



ప్రకాశకులు:

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు,

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.

వెల రు 0—10—0

# అదృష్టదీపిక

ఇది

మద్దూరి శ్రీరామమూర్తి కవిగారిచే

రచియింపఁబడినది



ప్రకాశకులు

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు,

శ్రీ [illegible]

రాజమహేంద్రవరం.

[illegible]

వెల రు 0—10 [illegible]

# విషయసూచిక

శ్రీ

శ్రీహరిహరహిరణ్యగర్భేభ్యోనమః

# అదృష్టదీపిక

## ఆశ్రమచతుష్టయము

చతురాశ్రమంబులలో బ్రహ్మచర్యాశ్రమమే ప్రధానమైనది. బ్రహ్మచర్యమును సేవించుచు గురుకులవాస మొనరించి బ్రహ్మచర్య వ్రతావలంబకుఁడై యుండునో యాతఁడు దేశోద్ధారకులగు సత్సంతానములను బడయఁగలఁడు. ఏలననిన, సుమారిరువది యేండ్ల ప్రాయమువరకును స్త్రీసాంగత్యములేక వీర్యరక్షణ మొనరించుకొనినందువల్ల వీర్యమునందు బలము జీవము మున్నగునవి యుండును. అవియే సత్సంతానమును బడయుటకు మూలకములగును. బ్రహ్మచర్యమున విద్యావ్యాసంగమునొంది సంపూర్ణ బలతేజోవిరాజితుండగు వటుండు గురుజనులయాజ్ఞగొని గృహస్థాశ్రమమును ప్రవేశించును.

గృహస్థాశ్రమమును మనుజుఁడు కామోపభోగంబుల దేలుచు సంసారసుఖంబు లనుభవించి పితృఋణమును దీర్చును. పిమ్మట వానప్రస్థాశ్రమంబున ప్రవేశించి తక్కుంగల ఋణద్వయంబులఁదీర్చి మోక్షగామియగును.

## 2 గర్భోత్పత్తి

స్త్రీలకు రజోదర్శనమైనది మొదలు ముట్లుడుగునంతవరకును గల కాలమార్తవ మనఁబడును. ఆయార్తవకాలమందుననే సంతానము కలుగుట కవకాశముండును. కొన్నికొన్ని యెడల రజోదర్శనమాగి పిమ్మటగూడ సంతానమును బొందుచుండిరి. కాని యయ్యది సాధారణముగా జరుగదు.

రజోదర్శనమైనది మొదలు 16 దినములవరకును గర్భాశయము తెరచికొనియుండి శుక్లమును గ్రహింపదగుశక్తి గలిగియుండును. ఆపదు నారుదినములపిమ్మట నొక్కొక్కచో గర్భోత్పత్తియగుటకూడ గలదు. కాని యట్లు సాధారణముగా జరుగదు.

సత్పుత్రులను బడయగోరు పురుషుడు భార్య రజస్వలైనది మొదలు నాల్గుదినంబులనువదలి పదునొకండు పదుమూడు దినంబులు విసర్జించి సరిదినంబుల భార్యతో క్రీడింపవలయును. శుక్లశోణితముల సంయోగమువలన పిండోత్పత్తియగును. సరిదినముల పిండోత్పత్తియైన పురుషశిశువును, బేసిదినంబుల పిండోత్పత్తియైన స్త్రీశిశువును బుట్టుదురు. పదునారవదినంబున పిండోత్పత్తియైనచో గొప్పవిద్వాంసుండును. రాజయోగము సంపదగల కుమారుడు జన్మించును. ఆఱవదినంబున పిండోత్పత్తియైన బుద్ధిమాంద్యుడగు కుమారుడు జన్మించును.

పిండోత్పత్తికాలమున స్త్రీపురుషు లెట్టిగుణములుకల పుత్రుడు కావలయునని సంకల్పించుకొందురో అట్టి పుత్రులు కలుగగలరని కొందరభిప్రాయము పడుచున్నారు. పిండోత్పత్తియైనది మొదలు 280 దినంబులకు 9 మాసముల 8 దినంబుల 9 గంటలకు సరిగా ప్రసవమగునని చెప్పుదురు. కాని కొన్నియెడల ఏడవమాసమున ప్రసవమగుటయును గలదు. కాని ఎనిమిదవ మాసమున ప్రసవమయినచో శిశువు మరణించును.

## 3 పిండవృద్ధి

శుక్లశోణితముల సంయోగమువల్ల, మొదట నావగింజాకృతిగ నేర్పడిన బింబము కొన్నిదినములలో నీటిబుడగవలె యగును. అటు పిమ్మట నొకపక్షమునకు అరటిమొగ్గవలెనుండును. 40 దినంబులకు పిండముయొక్క శరీరమున రెండుభాగములు కాన్పించును. 45 దినంబులకు శిరముభుజములుకలిగియుండును. మూడవమాసంబున కరచరణంబు

లలోని యర్థభాగము పొడచూపును. నాలుగవమాసంబున నాళికయును మిగిలిన కరచరణాదిభాగములు కలుగును. 5 వ మాసంబున కర్ణములును నాశికారంధ్రములును ఏర్పడును. 6 వ మాసంబున గోరులును జుట్టును గలుగును. 7 వ మాసంబున గుహ్యావయవంబులు కాన్పించును. 8 వ మాసంబున పరిపూర్ణావస్థజెంది తల్లి భుజించు యాహారాదుల సారమును బొడ్డుసూత్రముద్వారా తీసికొనుచుండును. 9 వ మాసంబున జ్ఞానము గలిగి మాతృగర్భ జఠరానలమునందు మలమూత్రాదుల యందును నిలువలేక క్రిమికీటకాదులచే భక్షింపబడుచు వివిధయాతనల నొంది తన్ను రక్షింపుమని పరమేశ్వరును గొనియాడును. 9 వ మాసమున తొమ్మిది దినంబులు నిండినపిమ్మట భూపతనమగును. భూపతనమగుటతోడనే పూర్వమున్న జ్ఞానము నశించును.

## లగ్న ప్రమాణములు.

| | రాజమండ్రి | చెన్నపురి | సింహాళము |
|---|---|---|---|
| మేషము | 4—20 | 4—15 | 4— 0 |
| వృషభము | 4—56 | 4—45 | 4—30 |
| మిథునము | 5—26 | 5—15 | 5—15 |
| కర్కాటకము | 5—31 | 5—30 | 5—30 |
| సింహం | 5—20 | 5—15 | 5—30 |
| కన్య | 5—10 | 5— 0 | 5—15 |
| తుల | 5—14 | 5— 0 | 5—15 |
| వృశ్చికము | 5—33 | 5—15 | 5—20 |
| ధనుస్సు | 5—19 | 5—30 | 5—30 |
| మకరము | 4—43 | 5—15 | 5—15 |
| కుంభము | 4—11 | 4—45 | 4—30 |
| మీనము | 4— 2 | 4—15 | 4—30 |

## వధూవరుల పొంతనములు

| నామాద్యక్షరములు | నక్షత్రములు | పాదము | రాశులు | రాశ్యధిపతులు | గణము | జంతువులు | నాడి | రజ్జు |
|---|---|---|---|---|---|---|---|---|
| చూ చే చో లా | అశ్వని | 4 | మేషం | కుజ | దేవ | గుఱ్ఱం | ఆది | పాద |
| లీ లు లే లో | భరణి | 4 | మేషం | కుజ | మను | ఏనుగ | మధ్య | కటి |
| అ ఈ ఉ ఏ | కృత్తిక | 1—3 | మేష-వృష | కుజ-శుక్ర | రాక్ష | మేక | అంత్య | ఉదర |
| ఒ వ వి వు | రోహిణి | 4 | వృషభం | శుక్ర | మను | పాము | అంత్య | కంఠ |
| వే వో కా కి | మృగశిర | 2—2 | వృష-మిథు | శుక్ర-బుధ | దేవ | పాము | మధ్య | శిర |
| కు ఘ ఙ ఛ | ఆర్ద్ర | 4 | మిథున | బుధ | మను | కుక్క | ఆది | కంఠ |
| కే కో హ హి | పునర్వసు | 3—1 | మిథు-కట | బుధ-చంద్ర | దేవ | పిల్లి | ఆది | ఉదర |
| హు హే హో డా | పుష్యమి | 4 | కటకం | చంద్ర | దేవ | మేక | మధ్య | కటి |
| డీ డూ డే డో | ఆశ్లేష | 4 | కటకం | చంద్ర | రాక్ష | పిల్లి | అంత్య | పాద |
| మ మి ము మే | మఖ | 4 | సింహం | రవి | రాక్ష | ఎలుక | అంత్య | పాద |
| మో ట టి టు | పుబ్బ | 4 | సింహం | రవి | మను | ఎలుక | మధ్య | కటి |
| టే టో పా పి | ఉత్తర | 1—3 | సింహా-కన్య | రవి-బుధ | మను | గోవు | ఆది | ఉదర |
| పు ష ణ ఠ | హస్త | 4 | కన్య | బుధ | దేవ | ఎనుము | ఆది | కంఠ |

సూచన :— పేరు మొదటి అక్షరమును ఏనక్షత్రమగునో చూచి కొని దానినే, నామనక్షత్రముగను, రాశిగను గ్రహింపవలయును. పైన చెప్పినవి గాక మిగిలిన కొన్ని అక్షరముల క్రిందిదానిని చూచుకొనవలెను.

| | |
|---|---|
| కృష్ణుడను పేరునకు మృగశిరానక్షత్రమందు | 3 వ పాదము |
| హృష్టుడనే పేరునకు స్వాతినక్షత్రమునందు | 1 వ ,, |
| శ్రీధరుడనే పేరునకు చిత్తానక్షత్రమునందు | 4 వ ,, |
| క్షేత్రపాలుడనే పేరునకు హస్తానక్షత్రమందు | 3 వ ,, |
| జ్ఞానుడుఅనే పేరునకు ఆరుద్రానక్షత్రమందు | 3 వ ,, |
| భీముడనే పేరునకు మూలానక్షత్రమునందు | 3 వ ,, |
| భైరవుడనే పేరునకు పూర్వాషాఢ నక్షత్రమందు | 3 వ ,, |
| క్షేత్రము అనే పేరునకు పునర్వసునక్షత్రమందు | 1 వ ,, |
| ఫణి అనే పేరునకు ఉత్తరానక్షత్రమందు | 3 వ ,, |
| ద్రోణుడనే పేరునకు / ద్రాక్షాది అను పేరునకు } స్వాతీనక్షత్రముయొక్క | 3 వ ,, |

### తారాఫలము కనుగొనుట

జన్మనక్షత్రము మొదలు నిత్యనక్షత్రమువరకు లెక్కించి 9 చే భాగించగా శేషము 1 జన్మతార, 2 సంపత్తార, 3 విపత్తార, 4 క్షేమతార, 5 ప్రత్యక్తార, 6 సాధనతార, 7 నైధనతార, 8 మిత్రతార 9 పరమమిత్రతారయని తెలుసుకొనవలెను.

### శుభదములగు తారలు

సంపత్తార, క్షేమతార, సాధనతార, మిత్రతార, పరమమిత్రతార శుభముల నొసంగును.

### అధమాధమ మధ్యఫలములగు తారలు

| అధమము | అధమాధమము | మధ్యమము |
|---|---|---|
| విపత్తార | నైధనతార | జన్మతార |
| ప్రత్యక్తార | | |

—♦ అధమాధమమధ్యములతో నిషేధింపబడిన పాదములు ♦—

| | |
|---|---|
| జన్మతార | నక్షత్ర మూడవపాదము |
| విపత్తార | నక్షత్ర రెండవపాదము |
| నైధనతార | నక్షత్ర రెండవపాదము |
| ప్రత్యక్తార | నక్షత్ర నాలుగవపాదము |

యీపాదములు శుభకార్యాచరణమునకు పనికిరావు. కడమ పాదములు యశుభఫలము. శాంతింప దానమొసగి చేయవచ్చును.

—♦ అశ్వని, భరణి, కృత్తికలో ఒకభాగము—మేషము ♦—

కృత్తికలో మిగిలిన మూడుపాదములు రోహిణి, మృగశిరలో రెండుపాదములు, వృషభము మృగశిరలో శేషించిన రెండుపాదములు ఆర్ద్ర పునర్వసులోని మూడుపాదములును మిధునము పునర్వసులోని శేషించిన పాదము పుష్యమి ఆశ్లేష ఆఖరువరకు కర్కాటకం, మఖ, పుబ్బ, ఉత్తరలో నొకభాగము సింహము మిగిల్చిన యుత్తరపాదములు మూడును హస్త, చిత్తలోని భాగమును, కన్య, చిత్తలోనిసగము స్వాతి విశాఖలో మూడుపాదములును, తుల విశాఖలో మిగిలిన పాదము అనూరాధ జ్యేష్టయును వృశ్చికము మూల పూర్వాషాఢలో నొక భాగము ధనుస్సు ఉత్తరాషాఢలోని మూడుపాదములును, శ్రవణం ధనిష్ఠలో రెండుపాదములును, మకరము ధనిష్టలో మిగిలిన రెండుపాదములు, శతభిషం పూర్వాభాద్రలోని మూడుపాదములు, కుంభము పూర్వాభాద్రలోని పాదము, ఉత్తరాభాద్ర రేవతి మీనము

—♦ గ్రహాధిపత్యములు ♦—

సూర్యుడు—సింహము
చంద్రుడు—కర్కాటకము
కుజుడు—మేషము, వృశ్చికము

బృహస్పతి—ధనస్సు, మీనము
శని—మకరము, కుంభము
బుధుడు—మిథునము, కన్య
శుక్రుడు—వృషభము, తుల
రాహుకేతువులు—నిర్ణయమగురాశి లేదు.

—♦ గ్రహముల యుచ్చ నీచ మూల త్రికోణాది వివరము ♦—

సూర్యు—మేషము. ఆ మేషమునందలి 10 వ భాగము పరమోచ్చము. మేషమున కేడవదియగు తుల నీచరాశియందు 10 వ భాగము పరమనీచము. సింహరాశిలోని మొదటి 20 భాగములు మూలత్రికోణము.

చంద్రు—చంద్రునకు వృషభ ముచ్చరాశి యందలి 3 వ భాగము పరమోచ్చము. వృషభము కేడవరాశియగు వృశ్చికము నీచరాశియందలి 3 వభాగము పరమనీచము. వృశ్చికమున శేషించిన యిరువదిరేడు భాగములును మూలత్రికోణము.

అంగా—మకర ముచ్చరాశియందు 18 వ భాగము పరమోచ్చమగును. కర్కాటక నీచరాశియందలి 18 వ భాగము పరమనీచము. మేషరాశిలో మొదటి 12 భాగములు మూలత్రికోణము.

బుధు—కన్యాలగ్న ముచ్చరాశియందలి 15 వ భాగము పరమోచ్చము. మీనము నీచరాశియందలి 15 భాగములు పరమనీచము. కన్యరాశిలో నాఖరు 15 భాగములు మూలత్రికోణము.

బృహస్పతి—బృహస్పతికి కర్కాటక ముచ్చరాశి యందలి 5 వ భాగము పరమోచ్చము. మకరము నీచరాశియందలి 5 వ భాగము పరమనీచము, ధనుస్సులో మొదటి 10 భాగములు మూలత్రికోణము.

శని—తుల యుచ్చరాశి యందలి 20 వ భాగము పరమో

చ్చము. మేషము నీచరాశి యందలి 20 వ భాగము పరమనీచము కుంభరాశిలోని మొదటి 20 భాగములు మూలత్రికోణము.

## సూర్యాది గ్రహముల శత్రుత్వ మిత్రత్వములు

సూర్యునకు—కుజుడు, గురుడు చంద్రుడు, మిత్రులు, శని శుక్రుడు శత్రువులు బుధుడు సమగ్రహము.

చంద్రునకు—సూర్యుడు, బుధుడు మిత్రగ్రహములు కుజుడు గురు, శుక్రుడు, శని సములు.

కుజు—సూర్యుడు, గురుడు, చంద్రుడు, మిత్రులు బుధుడు, శత్రువు, శని, శుక్రుడు సములు.

గురుడు—కుజుడు, చంద్రుడు, సూర్యుడు, మిత్రులు, బుధుడు శుక్రుడు శత్రువులు, శని సములు.

శని—బుధుడు, శుక్రుడు మిత్రులు. కుజుడు, సూర్యుడు, చంద్రుడు, గురుడు సమగ్రహము.

బుధుడు—సూర్యుడు, శుక్రుడు, మిత్రులు, చంద్రుడు శత్రువు, కుజుడు, శని, గురుడు సములు.

శుక్రుడు—శని, బుధుడు మిత్రులు. సూర్యుడు, చంద్రుడు శత్రువులు. గురుడు, కుజుడు సములు.

పైన నుదహరింపబడిన నైసర్గిక మిత్రత్వ శత్రుత్వములు. యింక తత్కాలికంబు లెట్టివనిన—

ఏగ్రహమునకైనను 2, 3, 4, 10, 11, 12 స్థానములయం దున్న గ్రహములు మిత్రములు మిగిలిన స్థానముననుండు గ్రహములు శత్రువులు. ఒక గ్రహమునకు నైసర్గిక మిత్రగ్రహము తాత్కాలిక శత్రుగ్రహమైనచో నది శత్రుగ్రహము నైసర్గిక శత్రుగ్రహము తాత్కా లిక మిత్రమైనను, నైసర్గిక మిత్రగ్రహము తాత్కాలిక శత్రుగ్రహమై

నను సమగ్రహములగును. నైసర్గిక సమగ్రహము తాత్కాలిక మిత్ర గ్రహమైన మిత్రగహము తాత్కాలిక శత్రుగ్రహమగును.

## చరస్థిరద్విస్వభావరాసులు

మేష, కర్కాట, తులా, మకరరాసులు చరములు. వృషభ, సింహ వృశ్చిక, కుంభరాసులు స్థిరములు. మిధున, కన్య, ధను, మీన ములు ద్విస్వభావరాసులు.

## రాసులయందు గ్రహములు నివసించుట

రవి 1 నెలయున్ను, చంద్రుడు 2 దినముల మధ్యాహ్నమును కుజుడు 1 నెల 15 దినములున్ను, బుధుడు 28 రోజులున్ను, గురుడు 13 నెలలున్ను, శుక్రుడు 25 దినములున్ను, శని 2 సంవత్సరముల 6 నెలలున్ను, రాహుకేతువులు 18 నెలలున్ను, యీ ప్రకారము ఒక్కొక్క లగ్నమునం దుండుదురు.

రవికుజులు ప్రథమములోనున్ను, గురుశుక్రులు మధ్యనున్ను, శనిరాహులు అంత్యమందున్ను, బుధచంద్రులు యెల్లప్పుడును ఫల ములు ఇచ్చుచుందురు. రవి 5 రోజులున్ను, చంద్రుడు 3 ఘడియ లున్ను, కుజుడు 8 రోజులున్ను, బుధ శుక్రులు 7 రోజులున్ను గురుడు రెండు నెలలున్ను, శని 6 నెలలున్ను, రాహు కేతువులు 3 నెలలున్ను, యీ ప్రకారము ఫలములు యిచ్చుచుందురు.

## గ్రహములకు క్రూరాది సంజ్ఞలు

రవి, కుజ, శని, రాహు, కేతువులు పాపగ్రహములు. చంద్ర బుధ, గురు, శుక్రులు శుభగ్రహములు. రవి, కుజ, గురులు పురుష గ్రహములు. చంద్ర, శుక్ర, రాహువులు స్త్రీగ్రహములు. బుధ, శని, కేతువులు నపుంసకగ్రహములు. గురు, శుక్రులు, బ్రాహ్మణ గ్రహ

ములు. రవి, కుజులు క్షత్రియగ్రహములు. చంద్ర, బుధులు వైశ్య గ్రహములు. శని శూద్రగ్రహము.

—♦ నక్షత్రములకు ప్రాదిసంజ్ఞ ♦—

అశ్విని, హస్త, పుష్యములుక్షిప్రనక్షత్రములు. మూల, ఆరుద్ర, జ్యేష్ఠ, ఆశ్లేష దారుణనక్షత్రములు. చిత్త, రేవతి, మృగశీర్ష, అనూరాధ మృదునక్షత్రములు. రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర స్థిరనక్షత్రములు. భరణి, మఖ, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర ఉగ్రనక్షత్రములు. కృత్తిక, విశాఖలు సాధారణ నక్షత్రములు. స్వాతి, పునర్వసు, శ్రవణం, ధనిష్ట, శతభిషం చరనక్షత్రములు.

—♦ చంద్రబలము ♦—

జన్మనక్షత్రరాశి లగాయితు నిత్యనక్షత్రరాశివరకు లెక్కించగా 1, 3, 6, 7, 10, 11 సంఖ్యలు యెల్లప్పుడును మంచివి. విశేషము యోచనగా శుక్లపక్షమున 2, 5, 9 సంఖ్యలును, కృష్ణపక్షమున 4, 8, 12 సంఖ్యలును యోగ్యములు.

—♦ మాసఫలము ♦—

శుక్లప్రతిపదాది నక్షత్రము మొదలు జన్మనక్షత్రము వరకు లెక్కించి తొమ్మిదిచే భాగించగా శేషము 1 ప్రయాణము, 2 సుభోజ్యము, 3 తనుతాపము, 4 సౌఖ్యము, 5 విద్యాభివృద్ధి, 6 లక్ష్మీప్రదము, 7 శోకము, 8 ధనలాభము, 9 సమస్తఫలములు.

—♦ జన్మనక్షత్రయుక్త వారఫలములు ♦—

జన్మనక్షత్రము ఆదివారముతోగూడిన ప్రయాణము, సోమవారముతోగూడిన స్త్రీసంభోగము, మంగళవారముతోగూడిన భయము, బుధవారముతోగూడిన సంపద, లక్ష్మీవారముతోగూడిన జయము. శుక్రవారముతోగూడిన భాగ్యము, శనివారముతోగూడిన రోగభయమని తెలుసుకొనవలయును.

## జనన ప్రకరణము

అశ్వని ప్రథమచరణమున జన్మించిన శిశువు మాతృహీనుడగును. మిగిలిన మూడుపాదములకును దోషములేదు. భరణీ తృతీయ చరణమున పురుషశిశువు జన్మించిన పితృగండము. స్త్రీశిశువు జన్మించిన మాతృగండము. మిగిలిన పాదములకు దోషములేదు. కృత్తికా మూడవపాదమున పురుషశిశువు జన్మించిన పితృగండము, ఆడశిశువు జన్మించిన మాతృగండము, తక్కిన మూడుపాదములకును స్వల్ప దోషముగలదు. రోహిణీనక్షత్రమున పురుషశిశువు జన్మించిన మేన మామకు గండమందురు. రోహిణీనక్షత్రమున మొదటి రెండుచరణములనైనచో మాతృగండము మిగిలిన రెండుపాదములలోనైన మేన మామకు గండము. పుష్యమీనక్షత్ర ప్రథమచరణమున జననమైన సామాన్యదోషము. ద్వితీయ తృతీయ చరణములలో మగశిశువు జన్మించిన తండ్రికిని స్త్రీ శిశువుదయించిన తల్లికి మారకము గలుగును. నాలుగవపాదమున సామాన్యదోషము. ఆశ్లేషనక్షత్ర ప్రథమచరణమందైనచో సౌఖ్యమును, రెండవపాదమున జననమైన ద్రవ్యహానియు. తృతీయచరణమున నైనచో మాతృగండమును, నాల్గవపాదమున పితృ గండమును గలుగును. మఖానక్షత్రము మొదటిపాదమునసైన శిశువునకే మారకము గలుగును. ద్వితీయపాదమునకు సామాన్యదోషము తృతీయపాదమున మగశిశు వుదయించిన పితృగండమును, స్త్రీ శిశువు జన్మించిన మాతృగండమును నగును. నాల్గవపాదమునకు స్వల్పదోషము. ఉత్తరఫల్గుని ప్రథమచరణమున మగబిడ్డ జన్మించిన పితృగండము ఆడుబిడ్డ జన్మించిన మాతృగండము. శేషించిన మూడుపాదములకును సామాన్యదోషము. హస్తతృతీయపాదమున పురుషశిశువు జననమైన పితృగండము, ఆడశిశువు జననమైన మాతృగండము తక్కిన మూడు పాదములకును దోషములేదు. చిత్రనక్షత్ర ప్రథమ ద్వితీయ చరణముల

మగశిశు వుదయించిన పితృగండము. ఆడశిశు వుదయించిన మాతృగండము శేషించిన రెండుపాదములును సామాన్యదోషములు గలవి. విశాఖనక్షత్రమున పురుషుఁడు జన్మించిన బావమరిదికి గండము లేక మరదలికి గండము. ఆడశిశు వుదయించిన మరదికి గండము. జ్యేష్ఠానక్షత్ర ప్రథమచరణమునకు సౌఖ్యనాశనము ద్వితీయచరణమునకు ధననాశనము మూఁడవపాదమునకు పెద్దతండ్రికి గండము. నాలుగవపాదమునకు సోదరగండము. (కొంద రీదిగువ జెప్పురీతిగా గూడ దోషములను నిరూపింతురు.) జ్యేష్ఠానక్షత్రమునకు పదిభాగములు జేసి యందు మొదటిభాగము మాతామహునకు రెండవభాగము తల్లితల్లికి, మూఁడవభాగము మేనమామకు నాలుగవభాగము జననికి, ఐదవభాగము శిశువునకు, ఆఱవభాగము వంశమునకు ఏడవభాగము మాతృపితృవంశములకును, ఎనిమిదవభాగము అగ్రసోదరునకు తొమ్మిదవభాగము, మామగారికిని పదియవభాగ మందరకును హానికలుగజేయును. మూలానక్షత్రము ప్రథమచరణము పితృగండము, ద్వితీయచరణము మాతృగండము మూఁడవపాదము ధననాశనకారకము నాలుగవపాదము శుభము చేకూరును. పూర్వాషాఢ నక్షత్ర తృతీయచరణమున పురుష శిశువైనచో పితృగండము ఆడబిడ్డయైనచో మాతృగండము. తక్కుంగల మూఁడుపాదములును సామాన్యదోషము చతుర్థచరణమున జననమందిన శిశువునకే హానిచేయును. మిగిలిన మూఁడుపాదములు దోషరహితములు.

### అశుభ నక్షత్రమున జన్మించిన పుత్రదర్శనమునకు విడువవలసిన మాసములు.

| | | | |
|---|---|---|---|
| ఉత్తర | 2 మాసములు | పుష్యమి | 3 మాసములు |
| చిత్త | 6 మాసములు | పూర్వాషాఢ | 8 మాసములు |
| ఆశ్లేష | 9 మాసములు | జ్యేష్ఠ | 15 మాసములు |

మూల 8 మాసములు.

### తిథిగండములు

అమావాస్య, పాడ్యమి, దశమి, ఏకాదశి, పౌర్ణమి, బహుళ పాడ్యమి; యీ ఆఱింటియొక్క సంధికాలములగు రెండుఘడియలును శిశువునకు గండము.

### వ్రతవిషయమై కూడని తిథులు

| | | | |
|---|---|---|---|
| పాడ్యమి | షష్టి | ఏకాదశి | త్రయోదశి |
| విదియ | సప్తమి | ద్వాదశి | చతుర్దశి |

### వారములు

శని, ఆది, మంగళ, శుక్రవారములు కూడవు.

కృత్తిక పునర్వసు చిత్త ధనిష్ఠ రోహిణి మృగశిర మఖ విశాఖ శతభిషం ఉత్తరఫల్గుని ఉత్తరాషాఢ పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర రేవతి యీ నక్షత్రములు కూడవు.

తిథిదోషమయి వారము నక్షత్రము మంచిదైన నష్టములేదు. తిథివారములు దోషములైన స్వల్పదోషము. తిథినక్షత్రములవలన నర్ధదోషము. వారనక్షత్రమువలన త్రిపాదదోషము. తిథివారనక్షత్రములు మిక్కిలి దోషము.

### నామకరణము

బ్రాహ్మణులకు 11 దినమునను, 12 దినంబున క్షత్రియులకును, 16 దినంబున వైశ్యులకును, 22 దినంబున శూద్రులకును, నామకరణంబును చేయవచ్చును. 12 దినమునందును 16 దినమునందును 22 దినమునందు, 29 దినమునందునుగూడ నామకరణము చేయవచ్చును.

### పుట్టువెంట్రుకలు దీయించుటకు

అశ్వని, పుష్యమి, పునర్వసు, మృగశిర, స్వాతి, రేవతి, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, యీ నక్షత్రములందును సోమ బుధ గురుశుక్ర

వారములందును సప్తమి, తదియ, పంచమి, త్రయోదశి, తిథులయందును పుట్టువెంట్రుకలు దీయించవచ్చును.

—♦ అక్షరాభ్యాసమునకు ♦—

హస్త, పునర్వసు, స్వాతి, అనూరాధ, ఆర్ద్ర, రేవతి, అశ్వని, చిత్త, శ్రవణం, పుష్యమి యీ నక్షత్రములందును గురు శుక్రవారములందును అక్షర స్వీకారము చేయవచ్చును.

—♦ అన్నప్రాశనము ♦—

పురుష శిశువునకు 6, 8, 10, 12 యీ మాసములయందును, స్త్రీ శిశువునకు 5, 7, 9, 11 మాసములయందును, సోమ బుధ గురు శుక్రవారంబులందును, అన్నప్రాశనము జేయవచ్చును. అన్నప్రాశనమునకు నిషేధింపబడిన తిథులు పాడ్యమి, చవితి, షష్ఠి, అష్టమి, నవమి, ఏకాదశి, అమావాస్య, పున్నమి ఈ తిథులు నిషేధములని యెఱుంగవలయును.

—♦ చెవులు కుట్టించుటకు ♦—

అశ్విని, మృగశిర, పుష్యమి, పునర్వసు, హస్త, చిత్త, ఉత్తర ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, ధనిష్ఠ, యీ నక్షత్రములందును సోమ బుధ గురు శుక్రవారములయందును చంటిపిల్లలకు చెవులు కుట్టించవచ్చును.

—♦ ఉపనయనము ♦—

బ్రాహ్మణ క్షత్రియ వైశ్యుల కుపనయన యుక్తకాలము.

బ్రాహ్మణులకు—జనన సంవత్సరము మొదలు లెక్కించి—యెనిమిదవ వత్సరమందును—వసంతఋతువునందును నుపనయనము చేయవలయును.

క్షత్రియులకు—పదునొకండవ సంవత్సరమునందును గ్రీష్మ ఋతువునందునను నుపనయనము చేయవచ్చును.

వైశ్యులకు—12 వత్సరమునందునను శరదృతువు నందునను నుపనయనము చేయవచ్చును.

మాఘాదిపంచకము, శ్రేష్ఠమాసములగుటవలన నా మాసము లలో గురు శుక్రమూఢములు లేకున్న బ్రహ్మక్షత్రియవైశ్యుల కుప నయన మాచరింపవచ్చును.

పై చెప్పబడిన సంవత్సరములందు జేయుటకు వీలులేనియెడల 10 వ 11 వ సంవత్సరములందు గూడ నుపనయన మొనరింపవచ్చునని కొందరభిప్రాయము.

## —♦ వివాహమునకు గురుఫలం ♦—

పురుషులకు బృహస్పతి తృతీయషష్టమందును స్త్రీలకు లగ్న అష్టమ, ద్వాదశములందు నున్నయెడల వివాహము చేయకూడదు. తక్కిన లగ్నముల గురుడుండ చేయవచ్చును.

## —♦ వివాహమునకు దశవిధ పొంతనములు ♦—

వరుని నక్షత్రము మొదలు వధూనక్షత్రమువరకు గల నక్షత్ర ముల లెక్కించి తొమ్మిదిచే భాగించి శేషములేకున్న వివాహము చేయవచ్చును.

## —♦ ప్రాణిపొంతనము ♦—

అశ్వని, శతభిషం గుఱ్ఱములు. భరణిరేవతులు దంతావళములు. పుష్యమి కృత్తికలు మేకలు. రోహిణి మృగశిరలు సర్పములు. మఖ పుబ్బలు ఎలుకలు. ఆర్ద్రామూలలు కుక్కలు. పునర్వసు ఆశ్లేషలు పిల్లులు. హస్తస్వాతులు ఎనుబోతులు. చిత్తవిశాఖలు పులులు. అనూ

రాధా జ్యేష్ఠలు తేళ్ళు. ఉత్తర ఉత్తరాభాద్రలు గోవులు. అభిజిత్తు ఉత్తరాషాఢలు ముంగిసలు. పూర్వాభాద్ర ధనిష్ఠ సింహాములు, పూర్వాషాఢ శ్రవణములు కోతులు. వధూవరుల నక్షత్రములు రెండును సమప్రాణులైన నుత్తమము; ఇతర ప్రాణిజాతియైనను వైరజాతి గాకుండిన మేలు. వైరజాతి ప్రాణులైన వివాహము చేయరాదు.

## —♦ గణపొంతనము ♦—

అశ్వని, పుష్యమి, మృగశిర, హస్త, స్వాతి, పునర్వసు, అనూరాధ, శ్రవణ, రేవతి యీ నక్షత్రములు దేవగణమనబడును. భరణి, రోహిణి, ఆరుద్ర, పుబ్బ, ఉత్తర, పూర్వాషాఢా, ఉత్తరాషాఢా, పూర్వాభాద్ర యీనక్షత్రములు మనుజగణములనబడును. కృత్తిక, మఖ, విశాఖ, చిత్త, ఆశ్లేష, శతభిషం, ధనిష్ట, మూల యీనక్షత్రములు రాక్షసగణము లనబడును. వధూవరుల నక్షత్రములు యేకగణముగా నుండినను, దేవమానుషగణములైనను వివాహము చేయవచ్చును. మనుజరాక్షసగణములు గలవారలకు వివాహము చేయరాదు.

## —♦ మహేంద్ర పొంతనము ♦—

వధువునక్షత్రము మొదలు వరుని నక్షత్రమువరకు లెక్కించిన 4, 7, 10, 13, 16, 19, 22, 25 అయినయెడల వివాహము చేయవచ్చును.

## —♦ స్త్రీదీర్ఘ పొంతనము ♦—

స్త్రీ నక్షత్రమునకు పురుష నక్షత్రము పదమూటిపైన నున్న యెడల వివాహము చేయవచ్చు.

## —♦ రాజ్యాధిపతి పొంతనము ♦—

స్త్రీ రాజ్యాధిపతికిని పురుష రాజ్యాధిపతికిని, శత్రుత్వము లేకున్నయెడల వివాహము చేయవచ్చును.

## వేధపొంతనము

అశ్విని, జ్యేష్ట, భరణి, అనూరాధ, కృత్తిక, విశాఖ, రోహిణి, స్వాతి, ఆరుద్ర, శ్రవణం, పునర్వసు, ఉత్తరాషాఢ, పుష్యమి, పూర్వాషాఢ, ఆశ్లేష, మూల, మఖ, రేవతి, పుబ్బ, ఉత్తరాభాద్ర, హస్త, శతభిషం యీనక్షత్రములకు వైరము. చిత్త మృగశిర ధనిష్ట యీమూడు నక్షత్రములకు వేధయుండిన వివాహము చేయకూడదు.

## నాడిపొంతనము

అశ్విని ఆరుద్ర పునర్వసు ఉత్తర హస్త జ్యేష్ట మూల శతభిషం పూర్వాభాద్ర ఈతొమ్మిది నక్షత్రములు యేకనాడి. భరణీమృగశిర పుష్యమి పుబ్బ చిత్త అనూరాధ పూర్వాషాఢ జ్యేష్ట ఉత్తరాషాఢ యీనక్షత్రములు మద్యేకనాడి. కృత్తిక రోహిణి ఆశ్లేష మఖ స్వాతి విశాఖ ఉత్తరాభాద్ర శ్రవణం రేవతి యీనక్షత్రములు-పార్శ్వైకనాడి. స్త్రీపురుషుల నక్షత్రములు యేకనాడియుండుండ వివాహము చేయరాదు.

స్త్రీపురుషులయొక్క జన్మరాసులు మీనతులాలగ్నములుగానుండినను మిధున వృశ్చికములుగా నున్నను, వృషభ కర్కాటకములుగానున్నను మేష, కన్యలుగానున్నను, వృషభ ధనస్సులుగా నున్నను మకరసింహములుగా నున్నను, వివాహము చేయకూడదు.

## రజ్జుపొంతనము

మృగశిర, చిత్త, ధనిష్ట ఈ 3 శిరోరజ్జు. రోహిణి, ఆరుద్ర, హస్త, స్వాతి, శ్రవణం 6 కంఠరజ్జు. కృత్తిక, ఉత్తర, విశాఖ, ఉత్తరాషాఢ, పునర్వసు, పూర్వాభాద్ర ఈ 6 నాభిరజ్జు. భరణి పుష్యమి పుబ్బ, అనూరాధ, పూర్వాషాఢ ఉత్తరాభాద్ర ఈ 6 పూరురజ్జు. అశ్విని ఆశ్లేష, మఖ, జ్యేష్ట, మూల రేవతి ఈ 6 పాదరజ్జు. వధూవరుల నక్షత్రములు ఏకరజ్జుగా నుండిన వివాహము చేయరాదు.

వివాహమైనది మొదలు నాలవదినమునందైనను, వివాహదినము మొదలు 16 దినములవరకును గమనదినంబులందురు. (8, 10, 12, 14 16) తిథివారనక్షత్రయోగ కరణములజూడక నూతనవధువు గృహము ప్రవేశింపవచ్చును. పదునారుదినములు దాటినపిమ్మట నైదుసంవత్సరమునందైనను నాలుగవ సంవత్సరమునందైనను ఆఱవ సంవత్సరమునందైనను నొక శుభముహూర్తమున నూతనవధువు భర్తృగృహము ప్రవేశింపవచ్చును. 5 సంవత్సరములు దాటినపిమ్మట సంవత్సర నియమము జూడపనిలేదు.

## రజస్వల ప్రకరణము

### శుభనక్షత్రములు.

హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, మూల, రేవతి, శ్రవణం, శతభిషం, అశ్వని, పుష్యమి, రోహిణి, మృగశిర యీనక్షత్రములయందు కన్యక పుష్పవతియైన శుభము.

### అశుభనక్షత్రములు

ఆరుద్ర, మఖ, భరణి, ఆశ్లేష, జ్యేష్ట, కృత్తిక, పునర్వసు, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర యీనక్షత్రములయందు కన్యక ప్రథమరజస్వలయైన నశుభము.

### శాంతినక్షత్రములు

జ్యేష్ఠ, ఆరుద్ర, మఖ, పునర్వసు, కృత్తిక, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, భరణి యియ్యవి శాంతినక్షత్రములు.

| నక్షత్రము. | విడువవలసిన కాలము. |
|---|---|
| జ్యేష్ఠ, ఆశ్లేష | 6 మాసములు |
| ఆరుద్ర | 6 మాసములు |

| | |
|---|---|
| మఖ | 5 మాసములు |
| పునర్వసు, కృత్తిక | 7 మాసములు |
| పుబ్బ, పూర్వాభాద్ర | 2 సంవత్సరములు |
| భరణి | 1 సంవత్సరము |

పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్రలయందును, భరణి, ఆశ్లేషలందును, ప్రథమపాదమున రజస్వలయైన భర్తృమరణమును రెండవపాదమందైనచో సంతాననష్టము, మూడవపాదమున పుష్పవతియైన ధననష్టమును, నాలుగవపాదమున రజస్వలయైన శుభమనియు దెలియదగినది.

## వేళయొక్క శుభాశుభ ఫలములు

ప్రాతఃకాలమున కన్య రజస్వలగుట శుభము. పూర్వాహ్నమందైనచో తీర్థయాత్రాపరురాలగును. మధ్యాహ్నమునందు పుష్పవతియైనచో సౌభాగ్యవతియై మనియుండును. అపరాహ్నమునందైన కార్యత్వము, సాయంకాలమున రజస్వలయైనచో వ్యభిచారిణియగును సంధ్యాకాలమునందైన వేశ్యయగును. పూర్వరాత్రమున రజస్వలయైనచో దీర్ఘాయువురాలగును. అర్థరాత్రియందు రజస్వలయైన వితంతువగును. అపరరాత్రియందైన కష్టజీవి యగును. తిథినక్షత్రలగ్నసంధులయందు రజస్వలయైన స్త్రీ దుర్బలయగును.

## తిథులయొక్క శుభాశుభ ఫలములు

పాడ్యమి, తదియలయందు రజస్వలయైన స్త్రీ భాగ్యవంతురాలగును. విదియ, చవితి, పంచమీ తిథులయందు పుష్పవతియైన శుభము. షష్ఠినాడు రజస్వలయైన వ్యభిచారిణి యగును. సప్తమియందైనచో సుపుత్రవతియగును. అష్టమి, నవమీ తిథులయందు ప్రథమ రజస్వలయైన దుఃఖభాగిని యగును. దశమియందు రజోదర్శనమైనకన్య

పుత్రవతి యగును. ఏకాదశియందు రజస్వలయైన శుచి శుభ్రములు గలది యగును. ద్వాదశియందు రజస్వలయైన స్త్రీ పరుల నిందించు స్వభావముకలదియై యుండును. త్రయోదశియందు పుష్పవతియైన సంతోషముగలిగి మెలగును. చతుర్దశియందు మహాపాపియు, పౌర్ణమి యందు సంతోషియు, అమావాస్యయందు విధవయు నగును.

## —♦ స్థలములయొక్క ఫలము ♦—

పురబాహ్యమునను, పర్వతమునమీఁదను రజస్వలయైన స్త్రీ వ్యభిచారిణి యగును. నోడలందైన పరమపతివ్రత యగును. గృహమునందైన మంచి శీలత్వముగలది యగును. పెరవాసియింటలైన దుర్మార్గురాలగును. దేవాలయములయందు రజస్వలయైన దీర్ఘాయు ష్మంతురాలగును. అరణ్యములందు పుష్పవతియైన స్త్రీ ధనధాన్య సమృద్ధితో తులతూగుచుండును.

## —♦ మాసములయొక్క శుభాశుభములు ♦—

చైత్రమాసమునందు రజస్వలయైన కన్య విత్తంతువగును. వైశాఖ మున రజస్వలయైనచో సిరిసంపదలు గలుగును. జ్యేష్ఠమాసమునందైన రోగయుక్తురాలగును. ఆషాఢమున రజస్వలయైనచో సంతానసష్టము సంభవించును. శ్రావణమునందు పుష్పవతి యగు కన్య కధనవతి యగును. భాద్రపదమాసమున రజోదర్శనమైనదుర్భాగియగును. ఆశ్వ యుజమున పుష్పవతియైన ప్రతినిమిత్తము కలిగియుండు స్వభావము గలిగి యుండును. కార్తికమాసమునందైన అల్పాయువుగలది యగును. మార్గ శిరమాసమున రజస్వలయైన సంతానవతి యగును. పుష్యమాసమున నయిన వ్యభిచారిణి యగును. మాఘమాసమునందైన సిరిసంపదలు కలుగును. ఫాల్గుణమాసమునందైన పతివ్రత యగును.

## వారములయొక్క శుభాశుభములు

ఆదివారము రజస్వలయైన కన్యక వ్యాధిపీడితురాలగును. సోమవారమున పుష్పవతియైన కన్యక పతివ్రతయగును. మంగళవారమున రజస్వలయిన కాంత దుఃఖభాగియగును. బుధవారము రజోదర్శనమైన పుత్రలాభమగును. గురువారమైనచో పత్యనురాగమునకు పాత్రురాలగును. శుక్రవారమునైన శుభము. శనివారమున రజస్వలయిన శుభము.

## లగ్నఫలములు

మేషలగ్నమునందు రజోదర్శనమైనచో దరిద్రురాలగును. వృషభలగ్నమునైనచో సంపద కలుగును. మిథునమునందు రజస్వలయిన ధనలాభము కలుగును. కర్కాటకమునందు రజస్వలయిన కులభ్రష్టురాలగును. సింహలగ్నమున పుష్పవతియైన దుఃఖభాగినియగును. కన్యాలగ్నమున రజోదర్శనమైన కన్యక జ్వరపీడితురాలగును. తులాలగ్నమున పుష్పవతియగు కన్యక సిరిసంపదలతో తులతూగుచుండును. మకరమునందైన దుఃఖభాగిని యగును. కుంభలగ్నమున రజస్వలయైన కన్యక సంతానవతి యగును. మీనలగ్నమున రజస్వలయైన కన్యక యల్పసంతానము గలది యగును.

## వాస్తుపురుషస్థితి క్రమంబులు

వాస్తుపురుషుడు భాద్రపదమాసము మొదలు కార్తికమాసము ఆఖరువరకును తూర్పువెక్కున తలపెట్టి శయనించును. మార్గశిరము మొదలు మాఘమాసము ఆఖరువరకు దక్షిణదిక్కున శిరస్సునుంచి శయనించును. ఫాల్గుణమాసము మొదలు వైశాఖమాసము ఆఖరువరకు పశ్చిమదిక్కున శిరస్సునుంచి శయనించును. జ్యేష్ఠమాసము మొదలు భాద్రపదమాసము ఆఖరువరకును ఉత్తరదిక్కున శిరస్సునుంచుకొని ఎడమప్రక్కగా తిరిగి శయనించును.

వాస్తుపురుషుని పాదములున్న దిక్కును వాస్తుపురుషుని దృష్టికి గోచరమగు దిక్కునను గృహములను గృహంబులను కట్టక తల వీపున యున్న దిక్కుల గృహములు కట్టవచ్చును.

## —◆ శల్యవాస్తు ◆—

సీ. భూశోధనము లేక పూని గృహంబులు
గట్టియుంచిన జెందునట్టి ఫలము
దెలిపెద బశువులు గలిగియుండియు నిండి
బాడిలేకుండిన బాలశల్య
ములు దూర్పుననుండు నిలవతులే ప్రొద్దు
నా గృహంబును చేయు నశ్వశల్య
మాగ్నేయముననుండు నహరహంబును జ్వర
తాపముగల్గిన దంతిశల్య
ములునుండు దక్షిణమ్మున ఋణమ్ముచేత
నుడివడియుండిన సూకరమ్ము
శల్యములుండు రాక్షసదిక్కునను నప
మృత్యుదోషంబులు మించెనేని
వృషభశల్యములుండు వేగ పశ్చిమమున
గ్రామంబులో బ్రజల్కలహమంది
యూరు వెళ్ళుమటంచు బోరిన గార్ధభ
శల్యముల్మారుత స్థలమునుండు
నర్థనాశనము ద్రవ్యముగల్గినను మేష
శల్యములుండు వైశ్రవణ దెసను
పారుగు లెప్పుడు జాల బోరుచుండిన
నిశాన్యమున గుక్క మొముకలుండు

నింటిలో గలహంబు లేఁప్రొద్దు గలిగిన
నట్టింట నుండును నరుని శిరము
ఇది విచారింపవలసిన నట్టిచోట్ల
నారుజేనల పొడవున నంతలోతు
త్రవ్వి యనిసీసివేయగ రతు లభించు
నాయురారోగ్యభాగ్యంబు లంబుజాక్ష.

పశువులు సమృద్ధిగానుండియు పాడిలేకున్న నాయింటి తూర్పు భాగమున బాలురశల్యము లుండియుండును. గృహయజమానునియొక్క ప్రభువు యజమానునిపై ననవరతము కోపించుచుండిన యెడల నాగృహముయొక్క ఆగ్నేయభాగమున గుర్రముయొక్క యెముక లుండును. సర్వకాలములందును గృహమునందున్నవారలు జ్వరపీడితులై యుండిన దంతావళముయొక్క శల్యములుండియుండును. గృహయజమాని యెల్లకాలంబును ఋణగ్రస్తుడై యుండుట సంభవించెనేని యా గృహముయొక్క నైఋతిదిక్కున పందియెముక లుండును. ఏగృహయజమానికి ద్రవ్యలాభము కలిగియు నాశనమగుచుండెనో యా గృహముయొక్క నుత్తరదిశయందు మేకయొక్క శల్యములుండి యుండును. ఏగృహమునందలివార లిరుగుపొరుగువారితో నెల్లప్పుడు కలహించుచుందురో యాగృహముయొక్క యీశాన్యదిగ్భాగమున కుక్కయొక్క ఎముకలుండియుండును, ఏగృహమునందు కుటుంబకలహము లధికముగా నుండునో యాగృహముయొక్క నడుమభాగమున మనుజునిపుర్రె యుండియుండును. ఆయా శల్యములను తీయుటకు ఏదిక్కున శల్యముండునో యాదిక్కున ఆరుజేనల వెడలుపుగల ప్రదేశమున నంతయేలోతు త్రవ్విన శల్యములు కాన్పించును. ఆ శల్యములను దీసివేసినయెడల గృహయజమాని కాయురారోగ్యభాగ్యములు గలుగగలవు.

## గృహారంభమునకు మాసఫలములు

ఇల్లు కట్టుటకు వైశాఖము శ్రావణము కార్తీకము మాఘ మాసము ఫాల్గుణమాసమును దగిన మాసములు,

| | | | |
|---|---|---|---|
| చైత్రము | హానిపశుక్షయం | ఆశ్వయుజము | కలహం |
| వైశాఖము | శుభము | కార్తీకము | శుభదము |
| జ్యేష్టము | మరణము | మార్గశిరము | భయం |
| ఆషాఢము | పశుక్షయము | పుష్యమి | అగ్నిభయం |
| శ్రావణము | సంపద | మాఘము | బహుసంపద |
| భాద్రపదము | రోగము | ఫాల్గుణము | రత్నలాభం |

ఈనిషేధింపబడిన మాసములు మాత్రమేగాక, గురు శుక్ర మౌఢ్యాదవ మాసములయందును నిల్లుకట్టుటకు ప్రారంభింపరాదు. ఇంతి యొకాక మిధునలగ్నమునను కన్యాలగ్నమునను ధనుర్లగ్నమునను మీన లగ్నమునను సూర్యుడుండ సూర్యోదయ మేలగ్నమున నగునో యా లగ్నమున సూర్యుం డుండెనందురు. గృహనిర్మాణం బొనరించుటకు తగదు. గృహస్థునిభార్య చూలాలై యుండ గృహారంభ మొనరింప కూడదు.

## గృహారంభమునకు లగ్నఫలములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| మేషము | సంపద | సింహము | సంపద | ధనస్సు | నష్టం |
| వృషభము | విశ్వాసము | కన్య | దరిద్రము | మకరము | ధనం |
| మిధునము | దహనము | తుల | శుభము | కుంభం | సంపద |
| కర్కాటకము | ఆయువు | వృశ్చికము | ధనము | మీనం | సంపద |

## గృహప్రవేశమునకు

శ్లో. హస్తాపుష్యపునర్వసూ శతభిషం స్వాతీ తథారోహిణీ
రేవత్యుత్తరమైత్రభం హరిమృగామూలాథనిష్టాశ్వనీ

కన్యాకుంభవృషాళి సింహమిథునే నక్షత్రదాశోత్తమం
వారాజీవిక నిజ్ఞ సోమవిజతే వేశ్యం ప్రవేశోత్తమం

నక్షత్రములు—అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి యీనక్షత్రముల యందు గృహప్రవేశమైన శుభములు జేకూరును.

వృషభము మిథునము సింహము కన్య వృశ్చికం కుంభము యీ లగ్నముల గృహప్రవేశ మొనర్పవచ్చును.

## గర్భాధానం

విదియ, తదియ, పంచమి, సప్తమి, నవమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి తిథులను రోహిణి, హస్త, చిత్త, స్వాతి, రేవతి మూల, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, శతభిషం, శ్రవణం, యీ నక్షత్రములును సోమ, బుధ, గురు, శుక్రవారములును గర్భాధానమున కుత్తమములు. పుష్యమి, మృగశిర, అశ్విని నక్షత్రములు.

## గర్భాధానమున కుత్తమలగ్నములు

వృషభము, మిథునము, కర్కాటకము, సింహము, కన్య, తుల, కుంభము, ధనస్సు, మీనము యీ లగ్నములు గర్భాధానమున కుత్తమములు.

భార్యాభర్తల రాశి కెనిమిదవయింట చంద్రుడుండ గూడదు. భార్యాభర్తల జన్మనక్షత్రమున కేడవ నక్షత్రమందును, పక్షద్వయగత షష్టి తిథులయందును, పరిఘానామయోగ పూర్వభాగమునందు పగటి ప్రొద్దుయందును, వైధృతి యోగంబునందును, సూర్యోదయాస్తమయ కాలములయందును, పంచపర్వములయందును, కృష్ణాష్టమి, కృష్ణ చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య, సంక్రాంతి, శుక్ల చతుర్దశియం

దును, ఏకాదశి మొదలుగా ప్రతిదినంబులందును పితృదినంబునందును వ్యతీపాతనామ యోగంబునందును చేయకూడదు.

## —♦ కూపారంభము ♦—

ఇంటికీశాన్యమున ఐశ్వర్యములు, తూర్పునవృద్ధి ఆగ్నేయమున పుత్రనాశనము, దక్షిణమున సౌఖ్యం, నైరుతి పశుమరహాని, వాయవ్యసంపద, ఉత్తరము భయము.

పంచాంగశుద్ధమగు దినవారంబులయందు తారాబలచంద్రబలములు చాలియుండగా మఖ, రేవతి, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, హస్త, అనూరాధ, శ్రవణము, రోహిణి, పుష్యమి, విశాఖ, మూల, కృత్తిక, ఆశ్లేష, భరణి యీ నక్షత్రములందు మీన, కటక, మకర, కుంభ, వృషభరాసులయందు గురు శుక్ర చంద్రులుకూడి యున్న లగ్నమందుగాని వానిచే జూడబడిన లగ్నమందుగాని బావి త్రవ్వుటకు ప్రారంభింపవలయును.

## —♦ విత్తనములు చల్లుటకు ♦—

అశ్వని, రేవతి, పుష్యమి, హస్త, పునర్వసు, మఖ, పుబ్బ, విశాఖ నక్షత్రములందు విత్తనములు జల్లుటవలన మిగుల లాభము కలుగును.

## అభ్యంగన నిషేధన దినములు.

శ్రవణం, ఆరుద్ర, అశ్వని, జ్యేష్ఠ యీనక్షత్రములందును, రాత్రి భాగమునను శుక్లాష్టమియు ద్వాదశియందును, నందలితిథులయందు పంచపర్వంబులయందును, శుక్లచతుర్దశియందును, ప్రతిదినంబునందును, స్వయముగా చేయబడిన శ్రాద్ధదినంబులందును, దీక్షామధ్యదినంబులందును, మంగళ, శుక్ర, గురు, ఆదివారములందును, యభ్యంగనము చేయగూడదు.

వివాహాది శుభకార్యాచరణాద్యంతదినములందును, నరకచతుర్దశియందును, మకరసంక్రమణమునకు తొలిదినంబునను, జాతాశౌచపూర్ణదినంబులను సంవత్సరాదియందును అభ్యంగనమాచరింపవలెను, ఇట్టిదినములను తిథివారనక్షత్ర దోషములు పొందవు. శుక్రవారము మధ్యాహ్నమున అభ్యంగనము చేయవచ్చును.

పుంసవన సీమంతములు.

2, 3. 5, 7. 10, 11, 13, ఆ, సోం, గు, రో, హ, చి, స్వా, పుష్య, ఉత్తరాత్ర, పున, అనూ, శ్ర, ధ, శ, రే, మే, మి, ధ, కుం, తు పుంసవనమునకు 3 వ మాసం సీమంతము 4, 6, 9 మాసములు.

జాతకర్మ నామకరణము.

2, 3, 5, 7, 10, 11, 13 తిథులును, సోమ, బుధ, గురు, శుక్రవారములును, అశ్విని, రోహిణి, పునర్వసు, పుష్యమి, ఉత్తరాత్రయం హస్త, స్వాతి, అనూరాధ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, యీ నక్షత్రములును, వృషభ, మిథున, కర్కాటక, కన్య, తుల, ధనుస్సు, మీన, లగ్నశుద్ధి.

డోలాహరణము.

2, 4, 5, 7, 9, 10, 11, 13, 15 తిథులును, ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారములును అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, ఉత్తరాత్రయ, హస్త, చిత్త, అనూరాధ, మూల, రేవతి, 1,3,5 మాసములు.

నిష్క్రమణము.

2, 3, 5, 7, 10, 11, 13, తిథులును, సోమ, బుధ, గురు, శుక్రవారములును, అశ్వని, రోహిణి, పునర్వసు, పుష్యమి, హస్త,

అనూరాధ, ధనిష్ట, రేవతినక్షత్రములు, మేష, వృషభ, కర్కాట, తుల ధనస్సు, మీనము 4 మాసము శుభము.

## వి ద్యా ర ం భ ము.

2, 3, 5, 7, 10, 11, 13 తిథులును, బుధ, గురు, శుక్రవారములును, అశ్విని, మృగశిర, ఆరుద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, పూర్వాత్రయ, హస్త, చిత్త, స్వాతి, మూల, శ్రవణము. (దశ) మేష, మిధున, కర్కాట, తుల, ధనస్సు, మకరము, మీన, అనధ్యయతిథులు అశుభములు.

## బీ జా వా ప న ము.

2, 3, 5, 7, 10, 11, 13, 15 తిథులును, సోమ, బుధ, గురు శుక్రవారములును, అశ్విని, రోహిణి, పుష్యమి, మఖ, ఉత్తరాత్రయ, హస్త, స్వాతి, అనూరాధ, మూల, ధనిష్ఠ, రేవతి, కర్కాట, తుల, ధనస్సు, మీనము శుభగ్రహదృష్టి.

## వృక్షలతాది స్థాపనము

2-3 6-7-10-11-13-15 తిథులును, సోమ, బుధ, గురు, శుక్రవారములు, అశ్విని, రోహిణి, మృగశిర, పుష్యమి, హస్త, చిత్త, విశాఖ, అనూరాధ, ఉత్తరాషాఢ, రేవతి నక్షత్రములును మేష, వృష, కర్కా, వృశ్చి శుభగ్రహదృష్టి.

## దే వ తా ప్ర తి ష్ట

2-3-7-8-10-12 ఆది, సోమ, బుధ, గురు, శుక్ర, శనివారములును, అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, శ్రవణము, ధనిష్ట, శతభిషము, రేవతి, నక్షత్రములును, వృషభ, సింహ, వృశ్చిక, కుంభ, మేష, కర్కాటు, సౌమ్యదేవతల కుత్తరాయణం, ఉగ్రదేవతలకు దక్షిణాయనము.

## యాత్ర

2-3-5-7-10-11-13 తిథులును, బుధ, గురు, శుక్రవారములును అశ్వని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, అనూరాధ, శ్రవణము, ధనిష్ఠ, రేవతి, (ఉత్తరాత్రయం) తుల, ధనస్సు, మీనం, వృషభం, మిధునం, మకరం, కర్కా, పంచమశుద్ధికి శకునం.

## వధూగృహప్రవేశము

తిథివారం నక్షత్ర యోగకరణములు బాగుండకపోయినను, వివాహమైన దినము మొదలుకొని, 6-8-10-12-14-16 వ దినముల యందు క్రొత్తకోడలిని అత్తింటికి తీసుకొనిరావచ్చును. 16 దినముల ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, పునర్వసు, పుష్యమి, రోహిణి, అనూరాధ, అశ్వని, జ్యేష్ఠ, హస్త, స్వాతి, శతభిషము, శ్రవణము, చిత్త యీనక్షత్రములు మంచివి పగటివేళ కూడదు.

## నూతన వస్త్రధారణ

విదియ, తదియ, పంచమి, షష్టి, సప్తమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, తిథులును; బుధ, గురు, శుక్రవారములును, అశ్వని, రోహిణి, పునర్వసు, పుష్యమి, ఉత్తరం, హస్త, చిత్త, స్వాతి, ధనిష్ట, అనూరాధ, ఉత్తరాభాద్ర, రేవతి ఈ నక్షత్రములును శుభము. సోమవారమును విశాఖనక్షత్రమును మంచివని కొందరి మతము.

## ఋతుశాంతి

షష్టి, అష్టమి, ఏకాదశి, చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య తిథులను అశ్వని, భరణి, కృత్తిక, ఆశ్లేష, మఖ, జ్యేష్ట, మూల, రేవతి నక్షత్రములును, స్త్రీపురుషుల జన్మనక్షత్రమునకు ఏడవతార నక్షత్రములును, వృషభ, కటక, కన్యా, వృశ్చిక, మకర, మీనలగ్న

ములును వైధృతీవ్యతీపాత యోగములను యివి లేనికాలములు శుభము నిచ్చును.

## మంచము నేయుట

ఆదివారము లాభము, సోమవారము సుఖము, మంగళవారము నకు అగ్నిదగ్ధము. బుధవారము రోగము. గురువారము పుత్రలాభము శుక్రవారము సౌఖ్యము. శనివారము మరణము.

## నిషేకము

2-3-5-7-10-13 సోమ, బుధ, గురు, శుక్రవారములును. అశ్వని, రోహిణి, ఉత్తరాత్రయం, చిత్త, అనూరాధ, మూల, శ్రవణము, ధనిష్ట, శతభిషము, రేవతినక్షత్రములును వృషభము, మిధునము, కర్కాటకము, తుల, ధనస్సు, మీనలగ్నశుద్ధి, సంధ్యాపర్వవ్రత శ్రాద్ధదినములు నింద్యములు.

## సర్వకార్యములకు

మఖ, మృగశిర, హస్త, స్వాతి, మూల, అనూరాధ, రేవతి, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర యీ నక్షత్రములందు వివాహాది సర్వశుభకార్యములు చేయవచ్చును.

## వేరుపూతకు

రేవతి, ఉత్తరాభాద్ర, ఉత్తరాషాఢ, రోహిణి, హస్త, పుష్యమి, మూల, మృగశిర, స్వాతి, జ్యేష్ట, అశ్వని యీ నక్షత్రములందును గురు, శుక్ర, సోమవారములందును, కన్యా, కర్కాటకము, మిధునము మీనము, మకరము ఈ లగ్నములందును వేరువేయవచ్చును.

## ప్రయాణమునకు మంచి నక్షత్రము

మృగశిర, అశ్వని, పుష్యమి, పునర్వసు, హస్త, అనూరాధ, శ్రవణం, ధనిష్ట, రేవతి యీనక్షత్రములందు ప్రయాణముచేసిన శుభము కలుగును.

## ప్రయాణమునకు తిధులు

విదియ తదియ పంచమి సప్తమి దశమి ఏకాదశి త్రయోదశి తిధుల్లు ప్రయాణముల కనుకూలములు, పాడ్యమి చవితి షష్టి అష్టమి నవమి ద్వాదశి పౌర్ణమి అమావాస్య తిధులయందు ప్రయాణము కాగూడదు.

## ప్రయాణ మొనర్చదగు వారములు

మంగళవారమున తూర్పునకును, సోమ శనివారముల దక్షిణమునకును, పడమట బుధ గురువారములను, శుక్ర భానువారములయందు త్తరమునకు ప్రయాణమైన శుభము సిద్ధించును.

## వా ర శూ ల లు

సపూర్వే శనిసోమేచ నగురుర్దక్షిణేతథా
నపశ్చాద్భానుశుక్రేచ నోత్తరే బుధ మంగళే

| | | |
|---|---|---|
| 1 | తూర్పు | శనివారము సోమవారము |
| 2 | దక్షిణము | గురువారము |
| 3 | పశ్చిమము | ఆదివారము శుక్రవారము |
| 4 | ఉత్తరము | బుధ మంగళవారములు |

తూర్పునకు పోవుటకు శని సోమవారములు బయలుదేరరాదు. ఇట్లే తక్కిన దిక్కులకును పై జెప్పబడిన వారములందు బయలుదేరరాదు.

ప్రశ్నాక్షరములను రెంటిచే హెచ్చించి దానికి పన్నెండు కలిపి సప్త సంఖ్యచే విభజింపగా 1 శేషము వచ్చినయెడల వార్త తెలునననిన్ని, 2 శేషము వచ్చినయెడల అక్కడనే వున్నాడనిన్ని, 3 శేషము వచ్చిన యెడల మధ్యమార్గమం దున్నాడనిన్ని, 4 శేషమువచ్చిన యెడల త్వరలో వచ్చుననిన్ని, 5 శేషము వచ్చినయెడల సమీపమందున్నాడనిన్ని, 6 శేషము వచ్చినయెడల రోగములచే బాధపడుచుండెననియు, 7 శేషము వచ్చినయెడల మరణించెననియు చెప్పవలెను.

ప్రయాణవిషయమై తిథివారనక్షత్రశూలలు తత్పరిహారములు యోగిని తెలుపుచక్రము.

| దిక్కులు | తూర్పు | ఆగ్నేయ | దక్షిణం | నైఋతి | పశ్చిమం | వాయువ్యం | ఉత్తరం | ఈశాన్య |
|---|---|---|---|---|---|---|---|---|
| వారశూలలకు | సోమ<br>శని | గురు<br>శని | గురు | సోమ<br>శుక్ర | ఆది<br>శుక్ర | ఆది<br>మంగళ | మంగళ<br>బుధ ఇ | బుధ<br>12 |
| వారశూలలకు<br>దోషగడియలు | 8<br>8 | 22<br>3 | <br>22 | 8<br>15 | 15<br>15 | 15<br>12 | 1[illegible] ఇ<br>12 ఇ | వేలాలు |
| వారశూలలకు<br>భోజనరూపశాంతి | పెరుగు<br>నువ్వు<br>పిండి | నెయ్యి<br>నువ్వు<br>పిండి | నెయ్యి | పెరుగు<br>పరమాన్నము | పాలు<br>పరమాన్నము | పాలు<br>అనుములు | అనుములు<br>వేలాలు | |
| పోదగినవారములు | మంగళం | | సోమ<br>శని | | బుధ-గురు | ఆది-శుక్ర | | |
| తిథిశూలలు | పాడ్యమి<br>నవమీ | తదియ<br>ఏకాదశి | పంచమి<br>త్రయో | చవితి<br>ద్వాదశి | షష్ఠి<br>చతుర్దశి | సప్తమి<br>పౌర్ణమి | విదియ<br>దశమి | అష్టమి<br>అమా |

| దిక్కులు | తూర్పు | ఆగ్నేయ | దక్షిణం | నైఋతి | పశ్చిమం | వాయువ్యం | ఉత్తరం | ఈశాన్యం |
|---|---|---|---|---|---|---|---|---|
| యోగిని | శు॥ పా॥ ఏకాదశి బ॥ దశమి | శు॥ తది॥ త్రయో॰ బ॥ దశమి | శు॥ పం పౌర్ణమి బ॥ దశ | శు॥ చవితి చతుర్దశి బ॥ నవమి | శు॥ షష్ఠి బ॥ పా॥ ఏకాదశి | శు॥ సప్తమి బ॥ విదియ ద్వాదశి | శు॥ విదియ ద్వాదశి బ॥ సప్తమి | శు॥ అష్టమి బ॥ విదియ త్రయోదశి |
| నక్షత్రశూలలు | జ్యేష్టా ధనిష్టా | | అశ్వనీ శ్రవణం | | రోహిణి పుష్య | | హస్త పుష్యోత్తరములు | |
| నక్షత్రశూలలు దానము | పెరుగు | | నూనె | | బెల్లం | | పరమాన్నం | |
| లగ్నశూలలు | తుల కుంభం | మకర | వృశ్చిక మీనం | కర్కట | సింహం ధనస్సు | మేష | వృష | మిధునం |

ఆకాశయోగిని శు॥ నవమి, బ॥ చవితి భూమియోగిని శు॥ దశమి బ॥ పంచమి, చతుర్దశి అమావాస్య

| పూర్వ | ఆగ్నేయ | దక్షిణం | నైఋతి | పశ్చిమం | వాయువ్యం | ఉత్తరం | ఈశాన్యం |
|---|---|---|---|---|---|---|---|
| శు॥ పా॥ ఏకాదశి బ॥ దశమి | శు॥ తది॥ త్రయో॥ బ॥ దశమి | శు॥ పం పౌర్ణమి బ॥ దశ | శు॥ చవితి చతుర్దశి బ॥ నవమి | శు॥ షష్టి బ॥ పా॥ ఏకాదశి | శు॥ సప్తమి బ॥ విదియ ద్వాదశి | శు॥ విదియ ద్వాదశి బ॥ సప్తమి | శు॥ అష్టమి బ॥ విదియ త్రయోదశి |
| జ్యేష్ఠా ధనిష్టా | | అశ్వనీ శ్రవణం | | రోహిణి పుష్య | | హస్త పుష్యోత్తరములు | |
| పెరుగు | | నూనె | | బెల్లం | | పరమాన్నం | |
| తుల కుంభం | మకర | వృశ్చిక మీనం | కర్కాట | సింహం ధనస్సు | మేష | వృష | మిధునం |

ాగిని శు॥ నవమి, బ॥ చవితి భూమియోగిని శు॥ దశమి బ॥ పంచమి, చతుర్దశి అమావాస్య

## ఆనందాదియోగములు

| మం॥ | బు॥ | గు॥ | శు॥ | శ | |
|---|---|---|---|---|---|
| ఆ | హ | అ | ఉ | శ | ఆనందయోగం 15 దినములలో కార్యసిద్ధి |
| మ | చి | జ్యే | అ | పూ | కాలదండయోగం 25 దినములవరకు పనికాదు |
| పు | స్వా | మూ | శ్ర | ఉ | ధూమయోగం 5 దినములవరకు పనికాదు |
| ఉ | వి | పూ | ధ | రే | ధాత్రియోగం 15 దినములలో కార్యసిద్ధి |
| హ | అ | ఉ | శ | అ | రమ్యయోగం 16 దినములలో కార్యసిద్ధి |
| చి | జ్యే | అ | పూ | భ | ధ్వాంక్ష యోగం సకలకార్యనాశనం |
| స్వా | మూ | శ్ర | ఉ | కృ | ధ్వజయోగం 17 దినములకు ధనప్రాప్తి |
| వి | పూ | ధ | రే | రో | శ్రీవత్సయోగం లాభకరం |
| అ | ఉ | శ | అ | మృ | వజ్రయోగం కార్యనాశనం |
| జ్యే | అ | పూ | భ | ఆ | ముద్గరయోగం కలహప్రాప్తి |
| మూ | శ్ర | ఉ | కృ | పున | ఛత్రయోగం 17 దినములకు స్త్రీలాభం |
| పూ | ధ | రే | రో | పు | మిత్రయోగం మిత్రలాభం |
| ఉ | శ | ఆ | మృ | ఆ | మానసయోగం కార్యలాభం |
| అ | పూ | భ | ఆ | మ | పద్మయోగం జయం |
| శ్ర | ఉ | కృ | పున | పు | లంబయోగం అపకీర్తి |

## ఆనందాది యోగములు

| ఆ॥ | సో॥ | మం॥ | బు॥ | గు॥ | శు॥ | శ॥ | |
|---|---|---|---|---|---|---|---|
| వి | పూ | ధ | రే | రో | పు | ఉ | ఉత్పాతయోగం అవమానం |
| అ | ఉ | శ | అ | మృ | ఆ | హ | మృత్యుయోగం సర్వదర్శనం |
| జ్యే | అ | పూ | భ | ఆ | మ | చి | కాలయోగం అవమానం |
| మూ | శ్ర | ఉ | కృ | పున | పు | స్వా | సిద్ధయోగం శుభం |
| పూ | ధ | రే | రో | పు | ఉ | వి | శుభయోగం కార్యలాభం |
| ఉ | శ | అ | మృ | ఆ | హ | అ | అమృతయోగం తలంచినపని యగును |
| అ | పూ | భ | ఆ | మ | చి | జ్యే | ముసుయోగం దుఃఖకరం |
| శ్ర | ఉ | కృ | పున | పు | స్వా | మూ | గదాయోగము చెరుపుగలుగును |
| ధ | రే | రో | పు | ఉ | వి | పూ | మాతంగయోగం అశ్వలాభం |
| శ | అ | మృ | ఆ | హ | అ | ఉ | రాక్షసయోగం చెడ్డది |
| పూ | భ | ఆ | మ | చి | జ్యే | అ | చరయోగం దుర్వార్తశ్రవణం |
| ఉ | కృ | పున | పు | స్వా | మూ | శ్ర | స్థిరయోగం మిశ్రమఫలం |
| రే | రో | పు | ఉ | వి | పూ | ధ | వర్ధమానయోగం శుభం |

# గౌరీపంచాంగము

## పగటి కాలము

| ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|
| వుద్యో | అమృ | రోగం | విషం | వుద్యో | రోగం | విషం |
| లాభం | విషం | వుద్యో | అమృ | విషం | జ్వరం | అమృ |
| విషం | వుద్యో | జ్వరం | శుభం | జ్వరం | అమృ | జ్వరం |
| అమృ | లాభం | లాభం | వుద్యో | లాభం | కలహం | వుద్యో |
| శుభం | జ్వరం | అమృ | రోగం | అమృ | లాభం | శుభం |
| ధనం | అమృ | వుద్యో | శుభం | విషం | సుఖం | లాభం |
| అమృ | ఆచా | విషం | ధనం | కలహం | ధనం | ధనం |
| విషం | ధనం | లాభం | అమృ | జ్వరం | అమృ | లాభం |

## రాత్రి కాలము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| శుభం | రోగం | జ్వరం | లాభం | సుఖం | అమృ | విషం |
| అమృ | లాభం | వుద్యో | రోగం | రోగం | జ్వరం | వుద్యో |
| జ్వరం | వుద్యో | కలహం | విషం | కలహం | కలహం | శుభం |
| రోగం | ధనం | లాభం | వుద్యో | లాభం | లాభం | అమృ |
| కలహం | రోగం | రోగం | జ్వరం | వుద్యో | శుభం | కలహం |
| లాభం | అమృ | లాభం | లాభం | శుభం | ధనం | రోగం |
| వుద్యో | విషం | వుద్యో | ధనం | లాభం | అమృ | అమృ |
| రోగం | జ్వరం | ధనం | లాభం | వుద్యో | విషం | లాభం |

## ఆశౌచనిర్ణయము

బ్రతికియుండగా బుట్టి బొడ్డుకోయక పూర్వము శిశువు మరణించిన తలిదండ్రులకు, అన్నలకు వివాహము కాని అక్కలకు, జ్ఞాతులకు మూడుదినములు మృతాశౌచము. పిదప మిగతదినములు జాతాశౌచము

వివాహమైన అక్కలకు స్నానముతోసరి. మరణించి శిశువు జనించెనేని తల్లిదండ్రులకు, అన్నలకు, జ్ఞాతులకు 10 రాత్రులు మృతాశౌచము. బొడ్డుకోసినపిదప దశరాత్రములలో యేదినమున శిశువు మరణించినను వెంటనే స్నానముచేసి అందరును జాతాశౌచము పట్టదగినది గర్భిణి 6 మాసములు దాటినతరువాత 7—8 మాసములలో నేమాసమున ప్రసవించిన ఆమాస సంఖ్యగల దినములు జాతాశౌచ మృతశౌచముల బట్టవలయును. 10 రోజు సాయంత్రము యింతకు మిగిలిన జాతాశౌచము గాని, మృతాశౌచముగాని వినినయెడల యాశౌచము రెండుదినము లెక్కువ పట్టవలయును. అటుగాక 10 వ రోజు తెల్లవారుజామున వినిన యెడల 3 దినము లెక్కువ బట్టవలయును. శిశువునకు 10 వ రోజు దాటినదిమొదలు దంతములు వచ్చువరకు అనగా 3 వ మాసమువరకు మరణము సంభవించెనేని తల్లిదండ్రులకు 3 దినములు సోదర, జ్ఞాతి పక్షిణీదార్లకు స్నానము 6 వ మాసము మొదలు 3 వ సంవత్సరము గడచులోపున మృతిగలిగెనేని తల్లిదండ్రులకు 3 రోజులు సోదరజాతులకు పక రేయింబవలు ఆ శౌచము 3 వ సం॥రం మొదలు పురుషునకు ఉపనయనమువరకు స్త్రీకి వివాహమువరకు తల్లిదండ్రులకును 3 దినము లా శౌచము పక్షిణీదార్లుదగ్గర నున్నవారు 3 దినములున్నూ, దూర మున నున్నవారు తొంబదిగడియలున్ను ఆశౌచము బట్టవలయును. పినతల్లులు, పెదతల్లులు, మేనమామలు, వారిసంతానము, అమ్మమ్మ, తల్లిదండ్రి మేనత్తలు వారి సంతానమున కుమార్తెలు, వారిసంతానం అక్కచెల్లెండ్రు వారి సంతానము అత్తగారు, మామగారు, భార్య తోడబుట్టినవారు వీరు పక్షిణీదార్లు! స్త్రీవిషయములో సవతితల్లిగాని వారి సంతానముగాని చనిపోవుచో పక్షిణీ తప్పక పట్టవలయును. పురుషుని విషయములో భార్య సవతిసోదర సోదరీపక్ష మయినచో పక్షిణీలేదు. మేనమామ భార్యకును పక్షిణి లేదు.

పాదభేదముచే జ్వరనక్షత్ర మితిదిన ఫలములను తెలియజేయు చక్రము.

| నక్షత్రములు | జర్వమి తిదినమ్ | 1 పాదం | 2 పాదం | 3 పాదం | 4 పాదం | నక్షత్ర సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| భరణి | 11 | ...... | 41 | 1 | 10 | ఉగ్రనక్షత్రములు |
| ఆర్ద్ర | ...... | ...... | 13 | 23 | 10 | |
| పూఫ | 2 మా | 66 | 10 | 29 | 22 | |
| ఆశ్లేష | 9 | ...... | 14 | ...... | 54 | |
| మఖ | 24 | 10 | 15 | 30 | 40 | |
| స్వాతి | 2 మా | ...... | 20 | 19 | 21 | |
| విశాఖ | 20 | 20 | 26 | 13 | 99 | |
| మూల | 9 | 10 | 20 | 15 | 80 | |
| పూషా | 8 | 15 | 18 | 9 | 20 | |
| శతభిషం | 11 | 70 | 6 | 60 | 1 | |
| పూభా | 1 మా | 11 | 17 | ...... | 10 | |

ఫలములు — నక్షత్రములు ఆది, శని, మంగళవారములలో నొక వారముతోటిన్ని ప్రతిపత్ నవమి, చవితి, షష్టి, అమావాస్య, ద్వాదశి ఈ తిథులలో నొక తిథితోటిన్ని కలిసియుండగా జ్వరము వచ్చినయెడల మరణ మొందును.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| హస్త | 15 | 14 | ... | 15 | 19 | సాధారణనక్షత్రములు |
| అనూ | 10 | 9 | 6 | 17 | 15 | |
| జ్యేష్ఠ | 5 | 15 | 7 | 13 | 2 | |
| రేవతి | 9 | ... | 14 | 18 | 4 | |

ఫలము — ఈ నక్షత్రములు పైనచెప్పిన తిథికాలములతోఁ గూడినయెడల జాడ్యము చేసి అమితరోజులు గడచినపై నిమ్మళించును.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అశ్విని | 9 | 6 | 10 | 17 | 3 | శూన్యనక్షత్రములు |
| కృత్తిక | 9 | 10 | 16 | 17 | 41 | |
| రోహిణి | 7 | 7 | 9 | 3 | 10 | |
| మృగశీర్ష | 5 | 14 | 11 | 18 | 20 | |
| పునర్వసు | 7 | 20 | 4 | 7 | 18 | |
| పుష్యమి | 7 | 7 | 3 | 20 | 18 | |
| ఉత్తర | 15 | 7 | 4 | 9 | 20 | |
| చిత్త | 15 | 12 | ...... | 3 | 15 | |
| ఉషా | 7 | 13 | 18 | 9 | 20 | |
| శ్రవణం | 10 | 10 | 17 | 9 | 20 | |
| ధనిష్ఠ | 10 | 22 | ...... | ...... | 2 | |
| ఉషా | 8 | 28 | 11 | 17 | 11 | |

ఫలము.—ఈ నక్షత్రములు పైనచెప్పిన తిథి వారములతో గూడినప్పటికిని విశేషమగు జబ్బుచేయదు.

## జ్వరనక్షత్రఫలము.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ఆర్ద్ర | పు | ఉ | ఆ | జ్యే | ధ | శ | భ | కృ |
| పు | మ | హ | వి | మూ | శ్ర | పూభా | అ | రో |
| పుష్య | ఆశ్లే | చ | స్వా | పూషా | ఉషా | ఉభా | రే | మృ |

ఈ చక్రమందు వరుసగానున్న యేతొమ్మిది నక్షత్రములనైనను జ్వరమువచ్చినరోజు నక్షత్రమున్ను, జన్మనక్షత్రమున్ను, శూన్యసంచార నక్షత్రమున్ను కలిసియున్నయెడల ఆరోగి మృతుడగునని తాత్పర్యము.

ఇంటియందు తేనెపట్టు, మట్టిగూడు, మొండిచేయి,

గ్రద్దవాలుట సంభవించెనేని శుభాశుభములు.

గృహమధ్యమందును గృహమునకుఆగ్నేయ, దక్షిణ, నైఋతి

వాయువ్యభాగములయందు తేనెపట్టు, మట్టిగూడు, మొంటిచేయి, గ్రద్ద గ్రుడ్లగూబ జీలుగవాలుట సంభవించెనేని ఆయింటియందు వెంటనే మరణము సంభవించునని తెలియదగినది.

మిగిలిన దిక్కులయందు యివి శుభమునిచ్చును.

తేనెపట్టు యింటికి మధ్యభాగమున వెనుబద్దకుగాని దూలమునకుగాని గోడకుగాని ద్వారబంధమునకుగాని బట్టెనేని యజమానునికి అరిష్టము. గృహమునకు పూర్వభాగమున బట్టెనేని ధనలాభము. ఆగ్నేయమున అగ్నిభయం. దక్షిణమున యింటిలో నొకరికి మరణము. నైఋతిభాగము ధాన్యనాశనము. పడమట మనోవ్యాధి. వాయువ్యభాగమున అధిక ధనలాభము. ఉత్తరమున సంతానవృద్ధి ఈశాన్యభాగమున తీర్థయాత్రకాని, పుణ్యకార్యలాభముగాని తప్పక కలుగును.

తేనెపట్టు యేదిక్కునయందైనను త్రికోణాకారముగాగాని చేటవలెగాని లేక నలుచదరమైనగాని బట్టెనేని అచ్చట శాస్త్రోక్తరీతిని శాంతి చేయింపవలెను. శాంతివిధానము శాంతికమలాకరమందును స్మార్తానుక్రమణికయందును వ్రాయబడియున్నది. గృహమధ్యమున నెచ్చటనైనను మట్టిగూడు బయలుదేరెనేని యజమాని భార్యకు అరిష్టము. గృహప్రాగ్భాగమున యజమానుని కరిష్టము. ఆగ్నేయమున అగ్నిభయము. దక్షిణనైఋతి భాగములయందాయింటియం దొకనికి మృత్యుదోషము. పశ్చిమభాగమున రాజపూజ్యత. వాయువ్యభాగమున బంధుసమాగమంబును, ఉత్తరమున పశునాశనంబును, ఈశాన్యంబున పశులాభంబును తప్పక గల్గును. గ్రద్ద గుడ్లగూబ జీలుగ యింటి నడుమ దక్షిణముఖముగా గూర్చుండినను యింటియందు ప్రవేశించినను ఆగృహము 6 మాసమువరకు వదలివేసి విధ్యుక్తశాంతి జేయించి యింట ప్రవేశింపవలెను. లేనిచో యజమానుని కరిష్టము.

## —♦ వారములు ♦—

గురువారము, శుక్రవారము, శుభవారములు, శుభదములు.

## —♦ తిథులు ♦—

పంచమి, సప్తమి, త్రయోదశి, పౌర్ణమి, విదియ, తదియ, దశమి యను తిథులు గృహప్రవేశమున కనుకూలములు.

## —♦ గృహకర్ణికా చక్రము ♦—




ఈ చక్రమునందలి ఆరోహణ నక్షత్రములయిన అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మఖ, పుబ్బ, ఉత్తర, హస్త, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం, యీ నక్షత్రములు శుభములు, శిరో నక్షత్రములైన మృగశిర, హస్త, ధనిష్ట యీ నక్షత్రములు యధిక శుభములు. శేషించిన యవరోహణ నక్షత్రములు, శుభకర్మము లాచరించుటకు దగవు.

## ప్రశ్నభాగము



తన మనస్సులోని కోరికను దలంచికొని పక్షీ పక్షీ ఫలము సూచింపవేయని ప్రశ్నించి పైనున్న చక్రములో నొకబొమ్మ తాకి, యాబొమ్మయొక్క సంఖ్యను కేరళచక్రములో తాకిన సంఖ్యతో జేర్చి ద్వాదశరాశులకును భాగించి శేషమువలననే రాశిలో ఫలమునుచూచి కొనవలయును.

### కేరళచక్రము

| | | |
|---|---|---|
| ౧౬ | ౧౧ | ౧౮ |
| ౧౭ | ౧౫ | ౧౩ |
| ౧౨ | ౧౯ | ౧౪ |

కేరళచక్రములో తాకిన సంఖ్యను రాశిచక్రములో తాకిన సంఖ్యను కలిపి నవగ్రహములకును భాగించగా మిగిలిన శేషమువలన యాపంక్తిలోని ఫలమును జూచుకొనవలయును.

పై కేరళచక్రమున నెట్లుకూడినను ఒకే మొత్తము వచ్చును.

౧ మేషము

1 కార్యలాభమగును
2 చెమరోజులు వచ్చినవి
3 చింత్యమున సుఖము
4 విచారపతకము
5 లాభములేదు
6 కలకంఠ
7 మోసమున్నది
8 తత్తరపడకుము

౨ వృషభము

1 జాగరూకతతో నుండుము
2 లాభించునా ?
3 లాభమునకు సందియము
4 లాభించదు
5 మేలునకు శ్రద్ధవలయును
6 దిక్కుగానున్నది
7 భగవంతుడున్నాడు
8 ప్రార్థిగా లాభము

౩ మిథునము

1 లాభము కలుగును
2 యత్నమునుబట్టి లాభము
3 కష్టపడి సుఖింతువు
4 జయము
5 కష్టముపై కార్యసాధనము
6 కీడు గలుగనున్నది
7 లాభ మతిస్వల్పము
8 ఇప్పుడు కాదు

౪ కర్కాటకము

1 చింతింపవలదు
2 కష్టమున్నది
3 సదుపాయము
4 శత్రువున్నాడు
5 వోరుగాలిలో దీపము
6 మునెమొక దినంబున జూడు
7 లాభమున్నదా ?
8 లాభములేదు

౫ సింహము.

1 విచారములేదు
2 తప్పుమాటలాడకు
3 కష్టసాధ్యము
బాధ్యతను కష్టము
5 సంతసమున నుండుము
6 గోడమీదపిల్లి
7 జయము కలుగవచ్చును
8 పాములో చెరలాటము.

## కన్య

1 కష్టేఫలీ
2 ఇప్పుడు కాదు
3 కాలము వ్యత్యాసముగానున్నది
4 లాభంలేదు
5 కార్యలాభమగును
6 ప్రార్థనాస్వీకారము
7 ఈ ప్రశ్న చూడకు
8 తలచిన కార్యమగును

## తుల.

1 నిందమోసము
2 లాభము
3 తొందరకూడదు
4 అందుబాటులోలేదు
5 కష్టసాఫల్యము
6 లాభంలేదు
7 సాహసేలక్ష్మి
8 ఇప్పుడు కాదు

## వృశ్చికము.

1 వృథాయత్నములేల
2 దేవుడున్నాడు
3 మాటలతో నీడేరదు
4 కష్టమున్నది
5 కండచక్కెర
6 తొందరపడకుము
7 విచారము వలదు
8 లాభించును

## ధనుస్సు.

1 ఆశకు అంతులేదు
2 ఇప్పుడు కలదు
3 జయము కలుగును
4 అనుకూలమైన కాలము
5 అందుబాటులో నున్నది
6 యత్నమే యాటంకము
7 నమ్మిన మోసము
8 చేతిలో నమృతము

## మకరము

1 కార్యలాభము కలుగును
2 మెలకువ వలయును
3 ఆయాసమేల
4 కష్టాంతమందు
5 ఇప్పుడుకాదు
6 ధనమూలమునదంగగదే
7 కండచక్కెర
8 వైరిప్రయత్నమేల

## కుంభము.

3 లాభమున్నది
4 మోసమున్నది
5 సందియము వలదు
6 లాభమున్నది

3 కలహము కల్గును

4 ముందు కష్టము లున్నవి

7 కష్టములు కాచియున్నవి

8 లాభించును

## మీనము

1 లాభమున్నను ఫలము లేదు

2 కార్యసిద్ధి కలుగును

3 పట్టుదలయున్నదా ?

4 వృథావిచారమేల ?

5 జయము తప్పక కలుగును

6 దేవుడే గలడు

7 అడ్డముండదు

8 భయముడుగుము

## సీతామహాదేవిచక్రము

| | | | |
|---|---|---|---|
| రా | సీ | ల | సు |
| కుం | రావ | అం | భ |
| ఇం | మ్యా | షా | జాం |
| నార | వి | కై | గు |

రా—స్థానశోభంచ రామేణ=శుభము

సీ—సీతాయాం దుఃఖమేవచ=దుఃఖము

ల—లక్ష్మణే కార్యసిద్ధించ=కార్యసిద్ధి

సు—సుగ్రీవే బంధుదర్శనం=బంధుదర్శనము

కుం—మరణంతె కుంభకర్ణేచ=మరణము

రావ—రావణేన కులక్షయం=కులము క్షీణించును

అంగ—అంగదేచ ధృవం రాజ్యం=రాజ్యప్రాప్తి
భ—భరతే కార్యసిద్ధిదం=కార్యసిద్ధి
ఇం—ఇంద్రతనయేచ కల్యాణం=శుభం
మా—సర్వనాశంచ మారీచః=నాశనము
హ—స్వలాభం హనుమంతం=సర్వలాభము
జాం—దీర్ఘమాయుష్యం జాంబవత్=దీర్ఘాయువు
నార—నారదే కలహంచైవ=కలహము
వి—సర్వలాభం విభీషణే=లాభము
కై క—కైకేచ కలహంచైవా=కలహము
గు—గుహేచ=బంధుదర్శనమ్

## ప్రశ్న చూచే విధానము

పదహారు గవ్వలతో ప్రశ్న దలచుకొని మూడుసార్లు పందెము వేసి తిరుగబడిన గవ్వసంఖ్యగూడి పదహారుచే భాగించగా యెంత శేషము మిగిలితే అన్నవపంక్తిలోని ఫలము చదువుకొనేది.

ఉదా—ఒకపందెము వేయగా 8 తిరుగబడినవి.

| | |
|---|---|
| 1 | 4 |
| 3 | 12 |
| 8 | |
| మొత్తం | 24 |

16—24

1—8

8 శేషం గనుక ఎనిమిదవపంక్తిలోని ఫలము చూడవలెను. 8 భ—భరతే కార్యసిద్ధిదం—అని వచ్చినది. గనుక తలచినకార్యము కాగలదు. ఇట్లు ప్రశ్న చూచేది.

## శ్రీ రామ ప్రశ్న.

| | | | | |
|---|---|---|---|---|
| | | ఇ | ఈ | ఉ |
| | ఋ | ౠ | ఌ | ౡ |
| ఎ | ఏ | ఒ | ఓ | ఔ |
| అం | క | ఖ | గ | ఘ |

ఇకారే సర్వసిద్ధిస్తు శోభనం శీఘ్రమేవచ
ఆయుష్య పుత్రలాభంచ ఇకారే శోభనం భవేత్॥

దశరథుఁడు అయోధ్యలో బ్రాహ్మణులకు భోజనం పెట్టిన సమయం అన్నపూర్ణాదేవతా వృత్తమం.

ఈకారేలభతే సిద్ధిం పవిత్రం ప్రీతిభోజనం
సర్వకార్యంచ సిద్ధించ ఈకారే శోభనం భవేత్

ఈ ప్రశ్న దశరథుఁడు పుత్రులకొఱకు కమృతము తెప్పించిన సమయము ఉత్తమం.

ఉకారే లోకసంతాపం కలహ గృహాత్పత్తి
మహాఘోరం వుకారేచ కలహం నిశ్చయం భవేత్.

ఈ ప్రశ్న దశరథుఁడు దేవపూజకై పూజాద్రవ్యములు తెప్పించిన సమయము వీరభద్రోదేవతా మధ్యమం.

ఋకారే శుభం చైవ నిత్యం భవతుసంపదా
చింతితం కార్యసిద్ధించ శుభం భవతు నిశ్చయం.

ఈ ప్రశ్న విడుపకుండ పుత్రకామేష్టి విఘ్నముకాకుండ నైన

సమయము. వైకుంఠో దేవతా యుత్తమం.

ఋకారే దృశ్యతే శోకం అర్థంహానిక్షయం భవేత్
సర్వకార్యవినాశాయ మనస్తాపం భవిష్యతి.

ఈ ప్రశ్న విశ్వామిత్రుడు యాగసంరక్షణకై దశరథుని రామ లక్ష్మణులఁ బంపుమని యడిగిన సమయము మధ్యమం.

ౠకారే పుత్రలాభంచ శత్రుణాంచ సమాగమః
అతిశీఘ్రం సుఖంప్రాప్తిః అర్థలాభంచ సిధ్యతి.

ఈ ప్రశ్న అయోధ్యలో దశరథుని పాలనమున జనులెల్లరును శుభముగానున్న సమయము ఉత్తమము.

ఌకారే ఘనచింతాచ మహావ్యాధి ర్భవిష్యతి
సర్వకార్యవినాశంచ అర్థహాని ర్భవిష్యతి.

ఈ ప్రశ్న దశరథుఁడు శత్రువులమీద దండు వెడలిన సమయంబున ఆగ్రహచిత్తుఁడై చేసినకార్యం మధ్యమమగును.

ఎకారేఘ్న చకార్యాదౌకలహం శత్రుమేవచ
అర్థనాశనం మనస్తాపం పుత్రహానిర్భవిష్యతి.

ఈ ప్రశ్న రామలక్ష్మణులను విశ్వామిత్రుని యాగసంరక్షణకు బిలుచుకొనిపోయిన స్థలము చంద్రో దేవతా—ఉత్తమం.

ఏకారేణ నోజతేజస్వజాయతే నాత్మసంశయః
మహోత్పాతం విదూరంచ జాయతే కలహప్రదం.

ఈ ప్రశ్న రామలక్ష్మణులు మారీచ సుబాహులతో యుద్ధము చేసిన స్థలము చాముండి దేవతా మధ్యమం,

ఒకారే విషాదేచ మిత్రేసే చ విపత్యతా
విశ్వామిత్ర తతంకార్యం సర్వమేవ భవిష్యతి॥

ఈ ప్రశ్న విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులను సిద్ధాశ్రమమునకు దోడుకొనిపోయిన సమయం మధ్యమం.

ఓకారే భోగసంపత్తి, అర్థలాభం భవిష్యతి
మనోభిర్వాంఛితం కార్యం పుత్రమిత్రసమాగమం॥

ఉ త్త మ ము.

ఔకారే అర్థనాశంచ దుఃఖంకలహామేవచ
ప్రారంభేషు చ కార్యాణి తత్సర్వం నిష్ఫలంభవేత్.

శ్రీరామపట్టాభిషేకమునకు కైక విఘ్నముజేసిన సమయము అధమము.

అకారే దృశ్యతే లాభం అర్థలాభంచ జాయతే
కన్యాణాం పుత్రలాభంచ ఆరోగ్యం సుఖమేవ చ.

ఈ ప్రశ్న రామస్వామి జనకుని యింటనున్న విల్లువిరచి సీతను వివాహమాడిన సమయము ఉత్తమము.

కకారే జాయతే రాజ్యం పుత్రలాభం చ జాయతే
కార్యాశౌర్యం చ సిద్ధిం చ నకారేణాభి వృధ్యతి.

యీ ప్రశ్నకు రామలక్ష్మణులు హనుమంతుని పొడగని సుగ్రీవునితో స్నేహము చేసినతావు. ఉత్తమం.

ఖకారే బహుదుఃఖం చ అర్థనాశం తథైవచ
సర్వరోగ మవాప్నోతి దారిద్ర్యంచ పునః పునః.

యీ ప్రశ్న సీతాదేవి హనుమంతుని పొడగని శిరోమాణిక్య మిచ్చినతావు.

గకారే జయతే రాజ్యం ఆయుర్వర్ధన మేవచ
పుత్రలాభం మహాసౌఖ్యం సిద్ధిర్భవతు నిశ్చయం.

యీ ప్రశ్న రాముడు విభీషణున కభయమిచ్చిన సమయం ఉత్తమము.

ఘకారం దృశ్యతే భాగ్యం కార్యసిద్ధిశ్చ దృశ్యతే

సర్వకామప్రదం రాజ్యం కల్యాణం భవతు నిశ్చయం.

యీప్రశ్న రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు కుశలవులజూచిన స్థలము యుత్తమం.

ఇతి రామప్రశ్నః

## —:ప్రశ్నచూచువిధానము:—

పైనున్న చక్రమును శుభ్రముగా అలకి ముగ్గులుపెట్టిన స్థలమున నునిచి పూజించి శ్రీసీతారామలక్ష్మణ భరతశత్రుఘ్నాదులను హనుమంతుని ధ్యానించి కోరిక తలచుకొని యొకబాలుని పుష్పమిచ్చి పైచక్రములోని యక్షరములకున్న ఫలములు చూచుకొనవలయును. రిక్తతిథుల తాకిన కొన్నిరోజులవరకు నిరీక్షించి మరల ప్రశ్న చూడవలయును.

# సహదేవశాస్త్రము

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 111 | 112 | 113 | 114 | 121 | 122 | 123 | 124 |
| 131 | 132 | 133 | 134 | 141 | 142 | 143 | 144 |
| 211 | 212 | 213 | 214 | 221 | 222 | 223 | 224 |
| 231 | 232 | 233 | 234 | 241 | 242 | 243 | 244 |
| 311 | 312 | 313 | 314 | 321 | 322 | 323 | 324 |
| 331 | 332 | 333 | 434 | 341 | 342 | 343 | 344 |
| 411 | 412 | 413 | 414 | 421 | 422 | 423 | 424 |
| 431 | 432 | 433 | 434 | 441 | 442 | 443 | 444 |

ఈ ప్రశ్న శాస్త్రమునుబట్టి శుభాశుభఫలములు దెలిసికొనగోరినవారు ఒక్కచో చక్కగ నలికి ముగ్గులుపెట్టియొక పద్మమును వ్రాసి యందు పసుపుని ఘ్నేశ్వరుని ప్రతిష్ఠచేసి షోడశోపచారముల పూజించి తమ మదియందొక కోర్కె దలంచుకొని యొకబాలికచేతి కొక పుష్పమునొసంగి పై చక్రమునగల యంకెలలో నొకనిదానిని

తాకునట్లు జేయువలయును. పిమ్మట ఏయంకెతాకునో యా యంకెను వ్రాసిన ఫలమును చూచుకొనవలెను.

111

గీ. నీవు తలచిన కార్యంబు నిశ్చయముగ
జరిగితీరును మదిని సంశయమువలదు,

తా. నీవు తలంచిన కార్యమందు జయము కలుగును. మది ననుమానింపకుము. సంవత్సరమువరకు నీ కెట్టిలోపములులేవు.

112

మదిని, తలచిన కార్యమే ♦ మాత్రమును
జరుగదిది నిక్కమిాశ్వరు ♦ సన్నుతింప
ఫలము గలిగిన నొకవేళ ♦ గలుగవచ్చు.

తా. నీవుతలచినకార్యము కొనసాగదు. నీహితుని మూలమున హానిగలుగుచున్నది. కులదేవతను పూజించుము. ఫలము గలుగగలదు.

113

పుత్రలాభంబు ధనమును ♦ బొందగలవు
వ్యాకులముపోవు సుఖముల ♦ బడయగలవు.

తా. పుత్రలాభమును, ధనలాభమును గలుగగలదు. నీమది నున్న వ్యాకులము పోవును.

114

హితునివలనను మదిలోన ♦ నెంచినట్టి
కార్యలాభంబు తప్పక ♦ గలుగగలదు
మూడునెలలేగు పిమ్మట ♦ ముదము హెచ్చు.

తా. నీ మదియందూహించిన కార్యమొక స్నేహితునివలన లాభించును. ఈ దినమునుండి మూడు నెలలకుపైని నీకు మిగుల మంచి దినంబులు రాగలవు.

121 09

హెూతునివలనను వ్యాకుల • మెల్లదీరు
యిష్టదేవుని పూజింప • నెల్లకార్య
ముల జయంబును తప్పక • బొందగలవు.

తా. నీ మదియందలి వ్యాకులము దీరును. హెూతునివలన కార్య లాభమగును. కులదేవుని పూజించిన శుభము చేకూరును.

122

తలచుకార్యంబు ఫలియించు • తస్కరులక
రగతమైనధనంబు • సంప్రాప్తమగును
వృద్ధిజెందును వ్యాపార • మెల్ల నిజము.

తా. నీవు తలచినకార్యము ఫలించును దొంగలెత్తుకొనిపోయిన ధనమైనగూడ లభించును. వ్యాపార మభివృద్ధి నొందగలదు. నిశ్చయము.

123

నీమనోవ్యాకులంబులు • నిమిషమందు
దీరు నీదుప్రవర్తన • తీరుజూచి
బంధువులెల్ల విరోధులై • బరగుచుండ్రి
నీవు సన్మార్గమునబోవ • నిశ్చయముగ
కార్యలాభము చేకూర • గలదునీకు.

తా. నీకుగల వ్యాకులమంతయును దీరును. నీదుష్ప్రవర్తన కసహ్యపడి బంధువులెల్ల విరోధులై యుండిరి, సత్ప్రవర్తన దిద్దుకొనిన కార్యలాభము చేరగలదు.

124

దిగ్విజయమగు శత్రుల • తేజమణగు
పుత్రలాభంబు జయమును • బొందగలవు.

తా. నీ వొనరింపనున్న కార్యములు దిగ్విజయమగును. నీ శత్రువులు నశింతురు. పుత్రలాభమును ధనమును నొందగలవు.

131

గ్రహములకు శాంతియొనరింప ♦ కార్యములను
జయము కలుగును ♦ మదిలోన జరుపనున్న
కార్య మొక తరుణివలనను ♦ కలుగగలదు.

తా. నీవు తలంచిన గొప్పకార్య మొక తరుణీమణి సహాయమున కలుగగలదు.

132

నీవు దలచిన పనిగాదు ♦ నిశ్చయంబు
హితులె శత్రులయి యుంట లో ♦ నెంచికొనుము.

తా. నీవు దలచిన కార్యము జరుగదు. తత్కార్యసాధనకై యత్నించి ధననష్టములు బొందగలవు. నీకు కావలసినవారలె శత్రులయి యుండిరి.

133

తలపు తెల్లను చేకూరు ♦ దగినవాని
చెలిమి కలుగును శత్రువుల్ ♦ చెదరిపారి
పోదురు కులదేవతను నీవు ♦ పూజసేయు.

తా. నీవు తలంచిన కార్యము నెరవేరును. ఒక పెద్దమనుజుని సహాయము లభించును. శత్రులు పారిపోదురు. కులదేవతను పూజింప మిగుల శుభము గలుగును.

134

భావమందలి కోర్కె ♦ సాఫల్యమొందు
పుత్రలాభంబు ధనమును ♦ బొంధగలవు.

తా. నీవు తలంచిన కార్యమగును. పుత్రలాభము, ధనలాభము గూడ కలుగును.

41

ఎల్లరును సహాయంపడ ♦ సేగుడెంచి
కార్యసాఫల్య మొనసూర్ప ♦ గలరు నీకు.

తా. శత్రుమిత్రులను భేదములేక ఎల్లరును నీకు సహాయ మొనర్తురు. కార్యమందు జయంబునుగాంచగలవు. ధైర్యమును పోనాడకుము.

142

ఒకనిహితునిగ ♦ భావించియుంటివీవు
గాని లాభంబు నుంతయు ♦ గలుగబోదు
వాని విడచిన ధనము సం ♦ ప్రాప్తమగును
అమ్మవారిని గొలువు కా ♦ ర్యార్థివౌచు.

తా. ధనలాభము కలుగును నీ వొక దుష్టుని నమ్మితివి. వాని స్నేహంబు వదలిన నీకు లాభము కలుగగలదు. కార్యసిద్ధికై అమ్మవారిని పూజింపుము.

143

అతుల ధర్మాత్ముఁడైనట్టి ♦ హితునివలన
నీదుకోరికలీడేరు ♦ నిశ్చయముగ
జయముచేకూరు దేవుని ♦ సన్నుతింప.

తా. ధర్మమార్గమున వర్తించు హితునివలన నీవు దలచిన కార్యమగును. దేవుని పూజించిన యింకను సుఖముల బడయగలవు.

144

జయముచేకూరు వ్యాపార ♦ సంపదలును
వృద్ధిగాంచును నుద్యోగ ♦ సిద్ధిగలుగు.

తా. నీవు తలంచిన కార్య మెట్టులో కొనసాగగలదు. వ్యాపారము వృద్ధికాగలదు. ఉద్యోగ్యము కలుగును.

211

కోర్కెలెల్లను కొనసాగు ♦ కులము మిగుల
వృద్ధిగాంచును ధనము ల ♦ భింపగలదు
దూరదేశంబునకు బోవ ♦ గోరియుంటి
వృద్ధికొనసాగదిప్పుడీ ♦ వరసిమూడు
పక్షముల పిదప నది సం ♦ ప్రాప్తమగును.

తా. నీకోరికలు ఫలించును. కుటుంబవృద్ధి యగును. పుత్ర లాభము కలుగును. దూరదేశ మేగుటకు యత్నించుచుంటివి. మూడు పక్షము లేగువరకు అది ప్రాప్తించదు.

212

తొలుగు మదిలోని వ్యసనంబు ♦ కలుగు ధనము
రాహువున్నాడు నీజన్మ ♦ రాశియందు
కొలది దినముల కాతఁడు ♦ తొలగిపోవు.

తా. నీ మనోవ్యాకులము తీరును. ధనము కలుగును. పుత్ర లాభము కలుగును. నీ జన్మరాశినుండి కొలది దినములలో రాహువు వెడలుచున్నాడు.

213

కలుగులాభంబు ధనమును ♦ కలుగగలదు
చేయిజారిన సొమ్ము నీ ♦ చేతబడును
నొకడు నిను పాడొనర్పగా ♦ నున్నవాడు
వాని నమ్మక వర్తింప ♦ వలయునయ్య.

తా. ధనలాభము కలుగును. నష్టమైన ద్రవ్యము కలసివచ్చును. నిన్ను పాడొనరింపగా నొకడు తరివేచియున్నాడు. వాని నమ్మక వర్తించిన సుఖము కలుగును.

214

కష్టకాలంబు నీకిక ♦ గడచి చనియె
ఏడుదినముల పిమ్మట ♦ నెల్ల కార్య
ముల జయంబు గలుగును స ♦ మ్మదమునిందు.

తా. నీకష్టదినములు గడచినవి. వారమునదినము లేగినపిమ్మట నీకు సర్వసుఖములు గలుగగలవు.

221

కార్యనష్టంబు తప్పక ♦ గలుగగలదు
మానమేగిన మధ్యమ ♦ మగుట నిజము.

తా: నీ వేకార్యమును తలంచినను జరుగదు. తలచు కార్యంబు లన్నిట నపజయము కలుగును. నెలరోజు లేగిన మంచిదగును.

222

తలచు కార్యంబు తప్పక ♦ ధ్వంసమగును
గల దపాయంబు మదిలోన ♦ గలిగియున్న
చెడ్డతలపుల మానిన ♦ శ్రేయమగును.

తా. నీవు తలపెట్టిన కార్యమెల్ల ధ్వంసమగును. నీమదిలోని చెడు తలంపుల వీడిన మంచిదగును.

223

గ్రహము లుచ్ఛస్థానంబున ♦ గలరు నీకు
కార్యలాభము ధనమును ♦ గలుగగలదు.

తా. నీవు తలంచిన కార్యము నిశ్చయముగా నెరవేరును, ధనము కార్యలాభము గలుగగలదు.

224

అడ్డుగలుగదు తలచు ♦ కార్యంబులందు
ఒకరి కుపకార మొనరింప ♦ నుంటి వీవు
హాని యోచించి చేయు మో ♦ దము లభించు.

తా. నీవు తలచిన కార్యములు తప్పక నెరవేరును. నీ వొకరికి చేయదలచిన యుపకార మాలోచించి చేయుము.

231

జయము తప్పక చేకూరు ♦ భయముదక్కి-
వేచియుండుము కొన్నాళ్ళు ♦ వేడ్క-తోడ.

తా. తలచు కార్యమున జయముకలుగును. భయమునొందక కొన్ని దినములవరకు వేచియుండుము.

232

కష్టకాలంబుగడచె సు ♦ ఖంబులెల్ల
గలుగ గలవింక ధనమును ♦ గలుగఁగలదు.

తా. నీ కష్టదినములు గడచిపోయినవి. తలచిన కార్యమందు జయము కలుగగలదు.

233

వ్యసనముల మున్గియుండెనీ ♦ భావ మిపుడు
హితుఁ డొకండు నిన్ జెరుపగ ♦ నెంచియుండె
వానివదలిన సుఖముల ♦ బడయగలవు.

తా. నీ మనమొక వ్యసనముతో గూడియున్నది. హితుఁ డొకడు నిన్ను పాడొనరింప నెంచుచున్నాడు. వాని విడిచిన శుభము లతి శీఘ్రకాలమున గలుగగలవు.

234

జయముచేకురు శాత్రవుల్ ♦ భయమునొంది
పరుగులిడుదురు ధనమును ♦ బడయగలవు.

తా. శత్రువులు నాశనమగుదురు. ధనము లభింపగ నీదు నీ కష్టములు తీరును.

241

దుష్టుఁడొకడుండె వానిని ♦ తొలిగినంత
నీకు సౌఖ్యము కలుగును ♦ నిశ్చయముగ.

తా. నీకు చెరుపుచేయువాఁ డున్నాఁడు, వానిని తొలగింపుము సుఖము చేకూరును.

242

మనమునందలి వ్యసనంబు ♦ దొరలిచనును
చేయుకార్యంబు యోచించి ♦ చేయుమయ్య.

తా. నీ మనమునందలి విచారముతీరును. నీ వొనరింపవలసిన కార్యమును చక్కఁగా యోచించి చేయుము.

243

పుత్రలాభంబు ధనమును ♦ బొందగలవు
కలుగునుద్యోగ లాభంబు ♦ గలదు జయము.

తా. పుత్రలాభము కలుగును. దేహసౌఖ్యము ఉద్యోగము కూడ కలుగగలవు. ధైర్యము విడువక యత్నింపుము.

244

హితునిగా నొక్కనిని మది ♦ నెంచినావు
వాని విడిచిన సుఖముల ♦ బడయగలవు.

తా. ఒకనిని హితునిగా నెంచియున్నావు వానిని వదలిన యెడల సుఖము చేకూరగలదు.

311

నీదు దేవుని మనమున ♦ నిల్పిపూజ
సేయఁగష్టములెల్ల ♦ చెదరిపోరు.

తా. నీకులదేవు నారాధన మొనరించిన నీకష్టములన్నియు దీఱ గలవు. నీమనమునందలి కోర్కె నెరవేరగలదు.

312

వ్యసనములుదీరు పుత్ర ♦ లాభంబుకలదు
జయముసిద్ధించు మదిని సం ♦ శయమువలదు.

తా. నీమనోవిచారములన్నియును దీరగలవు. నీకు త్వరలో పుత్రలాభము కలుగుచున్నది. నీ దేహమునగల వ్యాధి మానును. నీవు తలంచిన కార్యము జరిగితీరును. అధైర్యపడకుము.

313

ధనముగూర్పగ మదిలోన ♦ దలచినావు
నీదు కోరికలెల్లను ♦ నిశ్చయముగ
దీరగలవిక నీదేవు ♦ కరుణవలన.

తా. ధనమును గూర్పగా నెంచియున్నావు. అయ్యది నెఱవేరగలదు. సంశయము వలదు. నీకు దేవుని సహాయముగలదు.

314

కార్యలాభంబు తప్పకఁ ♦ గలుగఁగలదు

తా. నీవు తలచిన కార్యమగును. సంపదకలుగును. ధర్మమును విడువక సోమవారమున వ్రతముసేయుము. శుభ మొనగూడగలదు.

321

కార్యలాభంబు నెలలోన ♦ గలుగఁగలదు

తా. నీవు తలచిన కార్యమందు జయము తప్పక కలుగగలదు. కాని నెల దినంబులవరకు తాళియుండుము.

322

వ్యసనములుదీరు కార్యలాభంబు గలుగు

తా. నీవు తలచిన కార్యము నిశ్చయముగా జరుగగలదు. లాభము గలుగును. కార్యము కలుగును.

323

శత్రునాశనమగును సంశయమువలదు
కార్యలాభంబు దేవుని కరుణగలుగు.

తా. శత్రులు నాశనము కాఁగలరు. కార్యలాభము గలుగ గలదు. దేవు నారాధించుము.

324

ధర్మమార్గానువర్తులై దనరుచున్న
జయము కలుగును నీకెల్ల జగడములను.

తా. నీధర్మప్రవర్తన నీ శత్రువు నాశనమయ్యెను. ధర్మమార్గమున నడచుట మానకుండినయెడల ఎల్లకార్యంబుల జయమును గాంచ గలవు.

331

కార్యలాభంబు పుత్రులు కలుగగలరు
భార్యమూలమున జయము బడయగలవు.

తా. కార్యలాభము గలుగగలదు. కుటుంబవృద్ధి యగును. నీ భార్యసహాయమున నీకు జయము కలుగును.

332

కార్యమందున జయమిపుడు గలుగబోదు
హితుఁడె శత్రుండు మదిలోన నెంచుమయ్య.

తా. నీవు తలచిన కార్యమున జయములేదు. నీవు తలపెట్టిన కార్యములు చేసిన కష్టము కలుగును. నీస్నేహితుఁడే శత్రువు. వానిని నమ్మవలదు.

333

పుత్రలాభంబు దేవుని పూజసేయ
కార్యసాఫల్యము వేగగలుగ గలదు.

తా. పుత్రలాభము గలుగును. దేవుని నారాధించిన కార్య సాఫల్యముగూడ గలుగగలదు.

334

ధనము చేకూరు మదిని నధైర్యపడకు.

తా. భయము నొందకుము. ధనలాభము కలుగును

341

భయమునొందక శివుని రూపంబు మదిని
నిల్పి పూజింప శుభమౌను నిశ్చయముగ.

తా. భయమునొందకుము. లాభము కలుగగలదు. శివుని పూజింపుము. శుభము కలుగును.

342

కష్టములుదీరు లాభంబు గలుగగలదు
నెలలు రెండుగడచిపోవ నిశ్చయముగ.

తా. కష్టములు దీరును రెండునెలలేగినపిమ్మట లాభముగలదు.

343

అయిదునెలలేగు పిదప కార్యంబులందు
జయముచేకూరు మది సంశయమువలదు.

తా. కష్టకాలము నిన్ను విడువలేదు. అయిదు నెలలవరకు కష్టకాలమున్నది. పిదప కార్యములందు జయమును బొందగలవు.

344

కష్టకాలంబు గడచెను గలుగు సుఖము
పరులతో వివాదంబు బడకుమయ్య.

తా. నీ కష్టదినంబులు గడచి చనినవి. అయినను పరులతో వివాదము నొందకుము. జయము కలుగగలదు.

411

కార్యలాభంబు నీకిప్డు గలుగబోదు
గురుని పూజింప ఫలము చేకూరవచ్చు.

తా. నీవు తలంచిన కార్యముల జయ మిప్పుడు గలుగదు. గురుదేవుని పూజింపుము. ఫలము లోకవేళ గలిగిన గలుగవచ్చును.

412

నీవు తలంచిన కార్య నిశ్చయముగ
కొలదిదినములలోన చేకూరవచ్చు
దేవు నారాధనము సేయు దీక్షతోడ.

తా. నీవు తలచిన కార్యము కొన్ని దినములలో నెరవేరును. కార్యసాఫల్యమునకై దేవుని పూజింపుము.

413

ధనము నార్జించ మదిలోన దలచినావు
కాంతవలనను ద్రవ్యంబు కలుగగలదు
సజ్జనుని యండ జేరెదు జయముగలుగు.

తా. ఫలము సమితముగా గూర్పనెంచినావు. ఒక స్త్రీవలన నీకు గొంత ధనము చేకూరగలదు. మంచి స్నేహితుడు లభించును. వాని మూలమున నీకోర్కె లభించును.

414

కష్టకాలంబు నేటికి గడచి చనియె
నీదు మదిలోన కోరిక నెలకుగాని
దీరబోవదు ఫలము చేకూరువరకు
భక్తితో దేవు పూజింపవలయునయ్య.

తా. నీ కష్టములు గడచినవి. నీవు తలంచిన కార్యము ఒకనెల పోయిన పిమ్మట జరుగును. కులదేవత నారాధించుచుండుము.

421

కష్టద్రవ్యము చేకూరు నిష్టసిద్ధి
కలుగు లాభంబు పుత్రులు గలుగగలరు.

తా. చేయిజారిన సొమ్ము కూడివచ్చును. కోర్కెలు సిద్ధించును. పుత్రలాభమగును.

కష్టములుదీరె తలచిన కార్యమెల్ల
విఘ్నమేలేక జరుగును నెరుపవలదు.

తా. కష్టకాలము గడచినది. నీవు పట్టినది బంగారమగును. లాభించును. భయము నొందవలసినది లేదు.

423

తలచు పనులెల్ల లాభించును. భయమువలదు. నీవు దలచిన కార్యములన్నియు నెరవేరును. భయమువలదు.

424

కార్యలాభ మికముందు కలుగగలదు. ఇప్పుడు నీవు తలచిన కార్యము జరుగదు. ఇప్పుడు నీకు కష్టకాలములు వచ్చినవి. మున్ముందు జయము కలుగును. భయము పడవలదు.

కార్యలాభంబు నీ కిపుడు కలుగగలదు.

తా. నీవు తలచిన కార్యమగును. గ్రహస్థితి బాగుగానున్నది. భయపడవలదు. లాభము కలుగును.

431

తలచు కార్యంబులందున కలదు జయము.

తా. నీవు తలపెట్టిన కార్యములు ఫలించును. తలపెట్టిన కార్యములు సందేహింపక చేయుము. 432

వృద్ధిలాభంబు సుతులు లభింతు రింక

తా. వ్యాపారమున వృద్ధికలుగును. లాభము కలుగును. కుటుంబము వృద్ధియగును. ఉత్తమము.

433

తా. వ్యాపారం వృద్ధియగును. ధనలాభం గల్గును. మంచి స్నేహితులవలన ఇంటికార్యము చక్కబడును. పుత్రలాభము గల్గును. భయపడకుము. నానాటికి సుఖమిచ్చును. ఉత్తమం.

434

కోర్కె లీడేరు సుఖము చేకూరగలదు.

తా. నీవు తలంచిన కార్యము నిర్విఘ్నముగా జరిగి తీరును. ఇంతటినుండి నీవు సుఖముగా జీవింతువు.

441

నేడు లాభంబు గలుగదు నిజమునమ్ము.

తా. ఇంతలో లాభములేదు. రెండు సంవత్సరముల లోపున లాభము కలదు.

442

వ్యాధియున్నది నీదు దేహంబునందు
కాని నీకులదేవుని కరుణవలన
కార్యలాభంబు నిజముగ గలుగగలదు.

తా. నీ శరీరమున కొంచెక రుగ్మతయున్నది. అయినను భయములేదు. నీకులదేవుడు నిన్ను గాపాడును. లాభము గలుగగలదు.

443

కార్యలాభంబు నెలలోన గలుగబోదు.

తా. నీవు తలంచిన కార్యము నెలలో జరుగదు నష్టమున్నది.

444

తలచు కార్యంబు జేయగ గలుగు జయము
మున్ను విడిచిన పనచేయ మొదలుపెట్టి
నట్టులైనను నీకు సౌఖ్యంబు గలుగు.

తా. నీవు తలచిన కార్యములందు జయము గలుగును. మున్ను చేయ ప్రారంభించి విడిచిన కార్యము సాధింప యత్నించుము. సుఖము గలుగగలదు.

ఇతి సహదేవ ప్రశ్న భాగః.

## —♦ శుభ శకునములు ♦—

సుమంగళి యెదురుగ వచ్చుట శుభము. కన్యక యెదురేతెంచిన కార్యసాధనమగును. ఒంటిబ్రాహ్మణుడు రాకూడదు. ఇరువురు బ్రాహ్మణులు వచ్చుట మంచిది. వాద్యములు, ఫలములు, పుష్పములు మున్నగునవి శకునమైన శుభ మొనగూడును. పాలు, పెరుగు, మాంసము, కల్లు, చెరుకు మున్నగునవి వచ్చిన లాభము కలుగును. ఏనుగు, గుఱ్ఱము, పశువులు, నూతనవస్త్రములు, చాకింటిమడతలు, ముత్యములు, చిలుకలు, జింక, నెమలి మున్నగునవి శకునమయిన శుభము. చందనము, పసుపు, మామిడియాకులు, పుష్పహార వల్లరులు, ఎదురుగా వచ్చిన శుభము చేకూరును. ఈ వస్తువులు శకునమయిన ప్రయాణము సాగింపవచ్చును. కాకి, పాలపిట్ట, మున్నగునవి కుడిప్రక్క నుండి యెడమప్రక్కకు కేగిన లాభము. మిగిలిన పక్షులన్నియు యెడమ ప్రక్కనుండి కుడి కేగవలయును.

## —♦ కాకికూతకు ఫలములు ♦—

తూరుపు మొదలెనిమిది దిశలయందు కాకులు గుంపుగా జేరి ఒక్కొక్క దిక్కున మూడుమూడున్నర ఘడియలవరకు కూయుచుండును.

సూర్యోదయము మొదలు 3 ముప్పావు ఘడియలవరకు తూర్పున కూయుచుండిన ప్రయాణకర్తకు శుభము. 3 ముప్పావు మొదలు 8 న్నర నాగ్నేయమునున్న ప్రయాణకర్తకు శత్రునాశనమును గలుగును. తరువాత 3 ముప్పావువరకు దక్షిణంబుననుండెనేని బంధుభయము. తదుపరి 3 ముప్పావువరకు నైఋతిదిక్కున నుండినవేని ధనలాభము. పిమ్మట 3 ముప్పావువరకు నుత్తరంబున నుండినవేని ప్రాణహాని యును సాయంసమయమున యీశాన్యమునను ండిన నల్పభయమును సంప్రాప్తించును. ప్రయాణ మగునప్పుడు కాకి మైధునము దర్శనమయి నయెడల వ్యాధియు కలుగును.

లక్ష్మీచిహ్నంబులగు ఛత్రచామరంబులను గలిగి ఆందోళికారూఢుండగు భూపాలుండు, గరుడపక్షి, పక్షులసంఘము, ఛత్రచామరాందోళికాదులు మున్నగునవి ఎదురుగావచ్చుట శుభసూచకములు. భేర్య, మద్దెల, మున్నగువాని ధ్వనిమునకు మంగళవాద్యములును, సువాసనగల పుష్పములును, గొడుగు, అగ్నిజ్వాలలు, సన్నబియ్యపన్నము, కమలములు, ముత్యములు, ప్రవాళాదులు, శుభ్రముగా నుతకబడిన వస్త్రములు, ముత్తెములు, సాంబ్రాయికుండలు, పశువులు, వేదఘోషలు, సేలాలు, పూర్ణకలశములు, మంగళద్రవ్యములు, తేనె, నెయ్యి, మత్స్యములు, మున్నగువానిని జూచుటవలన సుఖమును ధనమును యిష్టాన్నమును కలుగును.

## శుభ శకునములు

సువాసిని తన భర్తనితోగాని పుత్రులతోగాని యెదురుగా వచ్చినను, గవయ యనుమృగ మెదురేతెంచినను, తుమ్మెదలు, కోతులు, రురువను మృగము శుకము, అశ్వము, పక్షులు మున్నగునవి యెదురుగా వచ్చినను కార్యము సుకరంబునగును. ప్రయాణమగునపుడు తెల్లని వస్తువులజూచుట శుభకరము. నల్లని వస్తువులను జూచుట అశుభకరము.

## అశుభ శకునములు

ప్రయాణమగునపుడు జంతువులు చెవులు తాటించినను, రెండు జంతువులు పరస్పరము కలహించుచుండినను, జంతువులయొక్క దంతములు, కొమ్ములు, పాదములు, తోకలు వీనిలో నేవైనను పడుచున్నవుడు చూచినను, జంతువుల మైథునమునుగాని, మూత్రపురీష విసర్జనముగాని జూచినను, ప్రయాణమగుచుండగా, నేజంతువైన నిర్బంధపఱచినను, ప్రయాణకర్తకు అశుభము కలుగును. ప్రయాణమగుచుండగా ప్రమాదమున వస్త్రములు, వస్తువులు, జారిపడుటయు దుర్మార్గవాక్యోచ్చారణము సేయుట, పల్లమునందు ప్రమాదమున పడుట, ఎదుటనున్న స్తంభము మున్నగువానిచే దెబ్బతగులుట, వెనుకనున్న బంధువులు మున్నగువారు భోజనము సేయుమని నిర్బంధపరచుట, వెనుకను పిలుచుట మున్నగునవి యశుభసూచకములు.

కల్లు త్రాగినవాడు, అంధుడు, వికృతాకారము గలవాడు, కుంటివాడు, జడగట్టిన శిరోజములు గలవాడు, రోగి, నూనె నొంటనున్నవాడు, వక్రాంగుడు, ఒంటిబ్రాహ్మణుడు, తల విరయబోసికొనినవాడు, విధవ, దిశమొల, దప్పికచే పీడింపబడినవాడు, పాషండుడు, శత్రుజనులు, క్షౌరము చేయించుకొనుచున్నవాడు, నపుంసకుడు. వస్త్రివాడు, తండ్రియుండగా జారునికి పుట్టినవాడు, ఆయుధములు ధరించినవాడు ఎదురుగా వచ్చిన మృత్యుప్రదమగును. చర్మము, బొగ్గులు, గడ్డి, ఎముకలు, అడుసు, వుప్పు, కిరాతుడు మున్నగునవి కాన్పించిన భయము కల్గును. ఉరుము, సర్పము, పిల్లి, కుబ్జుడు, కుందేలు, పెద్దపులి, వీని దర్శనమయిన మృత్యుప్రదమగును. గొడ్డురాలు పిండి, నూనె, మజ్జిగ, జడదారి, విభూతి మున్నగునవి కనబడిన నష్టము కల్గును. ఎండుకట్టెలు, నీరులేని కడవలు, ఊక మొదలగువస్తు

వృలు చూచుచు పయనమగుట శుభము. ఎలుగు, గరుడపక్షి, కోతి వీటి యొక్క ధ్వనియు, భల్లూకము, కోతి వీటిధ్వని పీడ. పాస్పుము కూత మృత్యుప్రదమగును.

---

## గౌళిశాస్త్రము

### బల్లిపాటునకు ఫలము



శిరమునందు బల్లి పడినయెడల కలహము సంప్రాప్తమగును. ముఖమునందైన దూరమునందున్న బంధువుల జూడనగును. కనుబొమల నడుమబడిన లాభముకలుగును. పై పెదవిబడిన యధికారుల యనుగ్రహమునకు బాత్రుండగును. క్రిందిపెదవిపై బడిన దుఃఖము గలుగును. కుడికంటిపై బడినయెడల సుఖమును, యెడమకంటిపై నైన కారాగృహ ప్రాప్తికలుగును. గడ్డముపై బడిన యధికారులచే దండింపబడును. నాసికపయి బడినయెడల సౌఖ్యము కలుగును. నోటిపై బల్లి

పడిన భంగముకలుగును. కంఠమునబడిన శత్రువులునశింతురు. దక్షిణ భుజమున బడిన యాయురారోగ్యము చేకూరును. వామభుజముననైన స్త్రీసంభోగము కలుగును. కుడిచేయిపైబడిన హానియు యెడమచేయిపై బడిన కీర్తియు, శిశ్నమున దరిద్రమును, రొమ్మునబడిన ధనలాభమును కలుగును. కుక్షిపై బడిన ధనధాన్యలాభమును తొడలపైబడిన పితరుల కరిష్టమును, మోకాళ్ళబడిన నశుభమును, కాలి మణికట్టులబడినశుభ మును, పాదములపై బడిన ప్రయాణమునుసిద్ధించును. స్తనములపై బడిన పాపమును, పృష్ఠభాగమునైన శుభమును నఖాగ్రములనైన ధననాశ నమును, శిరోజములనైన మృత్యుభయమును, లలాటమునందైన పట్టాభిషేకమును, వీపునబడిన ధననాశనమును కాలివ్రేళ్ళబడిన భయ మును కలుగును. శరీరమునందంతటను ప్రాకినయెడల దీర్ఘాయువును కలుగును. పైన చెప్పబడిన స్థలముపై తొండ ప్రాకిన నా ఫలములే సిద్ధించును.

## స్వప్నభాగము

స్వప్నంబులు శకునంబులవలె భావిఫలసూచకములు. కాని యన్ని స్వప్నంబులకు శుభాశుభ ఫలము లుండునని తలంచియుండరాదు పగటియందును, జాడ్యగ్రస్తుడై యుండునప్పుడును, నిద్దుర రాకుండునపుడు ను ఒక వస్తువునుగూర్చిచింతించి కలలోనద్దానినేగాంచినపుడును, భీకర దృశ్యముగాంచి వివశత్వమునొంది నిద్రావస్థజెందినతోడనే భీభత్స భయానక స్వప్నంబులకు ఫలంబులులేవు.

### స్వప్నఫలంబులు.

స్వప్నములు కలిగిన సమయమునుబట్టి సమయానుకూలంబుగ ఫలంబు నొసంగుచుండును. తొలియామమున స్వప్నము కలిగినయెడల వత్సరములోను రెండవయామమునవచ్చిన స్వప్నంబులు 8 మాసము లలోను, మూడవయామమున కలిగిన నారుమాసములలోను నాల్గవ

యామమునగన్న స్వప్నంబులు మాసములోనను, సూర్యోదయమున శుభాశుభ ఫలంబులు గలుగుచుండును.

స్వప్నమున జననీజనకులను గురుతుల్యులను కులవృద్ధులను మున్నగువారలజూచిన ధాన్యసంపద లభివృద్ధిజెందును తనకంటె చిన్న వారలజూచిన మంచిది. మిగుల పసివారలజూచిన శుభంబులు చేకూరును. పసిబిడ్డలను స్త్రీ కలలోజూచినయెడల నామె త్వరలో రోగ పీడితురాలగును. కలయందు వేశ్యను జూచ్చారలుజూచిన ధనహానిచేకూరును. కన్యక కలలో వేశ్యను యదృచ్ఛగ తామస దిలకించిన త్వరలో వివాహమగును. కాంత యటుల కలగనినయెడల సంపద కలుగును. స్త్రీరూపియగు మనుజుని పూరుషుడు కలలోజూచిన స్త్రీలవలన సులభముగా మోసగింపబడును. బోడితలగలవారల జూచిన దరిద్రము సంభవించును. వితంతువు కలలో గాన్పించకుండుట యుత్తమము. బట్టతల పూరుషుడు గాన్పించిన ధనలాభము సుభిక్షము. పసిబాలురు కనబడుట మంచిదియైనను యీ శిశువులు మురికితోకూడి యున్నట్లుగాను మురికి దుస్తులనుదాల్చి తాను కలలో గాన్పించిన నమ్మినవారివలన మోసము కలుగును. శిశువులు మరణించినట్లు జూచిన నాపదలు రానున్నవని యెరుంగనగును. తనహితు డొకం డాకస్మికముగా మరణించుట కలలో గాంచిన శుభవర్తమాన మాలించును. పెండ్లివారూరేగుచుండ గాంచిన సమీపస్థులలో నొకరు మరణింతురు. తన బంధువులలో నెవ్వరేని మరణించినట్లు కలగనిన వారెల్లరును సుఖముగా నున్నట్లు వార్త తెలియును. తన కెఱుకలేని పరులెవ్వరో మరణించినట్లు కలగనిన తన వారలకు మరణమో లేక యంతటికష్టమో రాగలదు.

ఏ మనుజుడు తాను కులహీనుడైనటుల కలగనునో యాతనికి ధనలాభము కలుగగలదు. తన కండ్లుబోవుటచే నవస్థపడుచుండుట

కలలోగాంచిన హితులవలన మోసము కలుగునని యెఱుంగవలయును. తనకు బధిరత్వము ప్రాప్తించినట్లు స్వప్నముగాంచిన స్నేహితులు మోసగింపనున్నారని యెఱుంగవలయును. తనకు మతిభ్రమ కలిగినటుల కలగన్న యెడల ధనలాభము, పుత్రలాభము కలుగగలదు. తన యాంగ ములు వికలత్వంబు నొందినటుల కలగనుట కీడు. వికలత్వము నొందియు మరల నావికలత్వము బోయినటుల కలగన్న మేలు చేకూరును. వికలాంగములకు సాధనాంతరము కల్పించుకొని కృత్యము లొనర్చు చున్నటుల జూచినకీడు. దిగంబరియై తాను దిరుగుచున్నటుల కలగనుట వలన కీడు గలుగును. తాను మనుష్యకంటె బలిసియున్నటుల కలగనిన నుద్యోగలాభము కలుగును. తనచేతులపై రోమము లుండినటుల కలవచ్చిన కష్టములు కలుగును. నెత్తురు కలలో జూచుట మంచిది కాని తనహృదయమునుండి రక్తము గారుచున్నటుల స్వప్నమైన కీడు చేకూరును. కత్తి మొదలగు నాయుధములచే తగిలిన దెబ్బలనుండి రక్తము కారుచుండుట కీడు. ఇతరులను తాను గాయపరచినటుల కలగనిన లాభము కలుగును. తన శిరమున కొమ్ములున్నటుల కలగనిన యధికారము కలుగును. ఇతరుల శిరమున కొమ్ములు మొలచినటుల జూచిన తనవారలు రోగపీడితు లగుదురు తలమువ్వకొనిన యట్లు కల గనుట లాభము.

తలవెండ్రుకలు చిక్కుపడియున్నట్లు కలనుగాంచిన ద్రవ్యహాని. గడ్డము మీసములు పెరిగియున్నట్లు కలగనిన ధనాభివృద్ధి. భయంకర ములైన దృశ్యములను గాంచి వెరచినట్లు స్వప్నమైన కార్యసిద్ధి యగును. తాను దుఃఖించుచున్నట్లు కల గనుటవలన లాభము కలుగును. ఇతరు లేడ్చుచుండగ చూచినటుల స్వప్నమైన చెరుపు అభ్యంగన స్నానమాచరించుచున్నట్లు స్వప్నమైన రోగపీడితుం డగును. చలిచే తాను పీడింపబడుచున్నటుల స్వప్నమైన కష్టములు కలుగగలవు.

తాను నిద్రించుచున్నటుల కలగనిన ద్రవ్యలాభము. ఇతరులు నిద్రించుచున్నటుల కలగనిన సుఖము కలుగును. ఇతరులతో పోరాడుచున్నటుల స్వప్నమైన కార్యసిద్ధి. వారల నిర్జించినటుల కలగన్న ధనలాభము. తానే చంపబడినట్లు కలగనిన మంచిది. తాను చెఱసాలలో నున్నటుల కలలో జూచిన లాభము. ఇతరులు చెఱసాలలో నున్నటుల జూచిన తానే చెఱసాలలో బడును. ఇతరు లురితీయబడుట జూచిన లాభము. తాను స్నానమాడుచున్నటుల కలవచ్చిన లాభము. స్నానముచేయు నీరు వేడిగనున్న కష్టము. నీరు యెంత వేడిగనుండునో యంత యెక్కువ కష్టములు కలుగగలవు. నీరు సమశీతలముగ నుండుట మేలు. చల్లగ నున్న ధనలాభము. తాను చెరువులో స్నానమాడుచున్నటుల కలగనిన మంచిది. ఆచెరువునీరు స్వచ్ఛముగానున్న లాభము. మురికిగానున్న నష్టము. నీరెంత మురికిగానున్న అంత యెక్కువ నష్టము. తనకు సింహము, తోడేలు, పులి మున్నగు క్రూరజంతువుల శిరంబు లున్నటుల కలలో జూచిన మేలు. గాడిద, గుఱ్ఱము మున్నగు క్షుద్రజంతువుల శిరంబులు తన కున్నటుల కలగనిన ధనధాన్యములు ప్రాప్తించును. విహంగముల శిరములబోలు శిరము తనకున్నటుల కలగనిన యాతడు దేశసంచార మొనరించును. తాను తపమాచరించుచున్నటుల కలగనిన యాతడు లోకోపకారి యగును.

ఇతరులు తనపై కోపపడినటుల కలగనిన వారెల్లరును తనకు కడుంగడు గూర్చు సఖులు కాగలరు. ఇతరులను తాను కొట్టినటుల కలగనిన వారలచే ప్రేమింపబడును.

భూసంబంధము—కాయకూరలతోడను ఫలపుష్పాదులతోడను నిండియున్న తోటలయందు తిరుగుచున్నటుల కలగనిన భాగ్యములు కలుగును. నెలలన్నియు పచ్చని పైరులతో నిండియున్నటుల జూచిన మేలు ధనలాభము. తనదొడ్డిలో విశేషముగా పాదులు, కాయలు

యుండినట్లు కలగనిన మితిలేని యాపదలు కలుగును. తనయింటి పెరటి యందు పూలమొక్కలు మున్నగునవి యున్నట్లు జూచిన లాభము కలుగును.

తాను నడచుచున్న భూమి యదిరినట్లుగాని కంపించినట్లుగాని యగు కలజూచిన యాపదలు కలుగును. తలచుకొనియున్న కార్యము లనుకొనినట్లు జయప్రదము గాజాలవు. భూకంపమువలన కొన్నిపట్టణ ములు నాశనమగుచుండుట జూచిన కీడు.

పచ్చచేలను గడ్డిమోపులను జూచుట మంచిది. ఎండుగడ్డి కన బడిన కీడు గలుగును. దుక్కిదున్నిన భూమిలో దిరుగుచున్నట్లు కల వచ్చినచో కలహము సంప్రాప్తమగును.

పర్వతప్రాంతముల దిరుగుచున్నటుల కనబడుటవలన కీడు. పర్వ తప్రాంతముల దిరుగుచుండగా స్నేహితుడు గాన్పించిన కీడు గలుగును. పర్వతగుహలనుండి సూర్యరశ్మి తగులు స్థలములలో కరుదెంచిన నాప దలు తొలగిపోవును.

గృహమున నిర్మించుచుండుట జూచిన మంచిది. అయ్యది తన గృహమే అయినయెడల ద్రవ్యలాభము కలుగగలదు. తానెత్తయిన ప్రదేశముల కెక్కుచున్నటుల కలవచ్చిన నుద్యోగప్రాప్తి. ఆయెత్తుప్రదే శమునుండి క్రిందకుబడినటుల కలగనిన ద్రవ్యహాని, ఉద్యోగనాశనం గూడ గలుగును. చెట్లు, చేమలు నెక్కుచున్నట్లు కలగనిన ధనలాభం చిరకాలములో గలుగగలదు. పర్వతమున కెగబ్రాకుచున్నటుల కల గనుట నాపదకు మూలము. జాగరూకతతో నద్దాని శిఖరమునుజేరిన లాభము. అట్లు చేయుటకు ప్రయత్నించుచు క్రిందపడినయెడల గొప్ప నష్టము కలుగగలదు. ఉప్పుప్రదేశమును చవిటిపర్రలను జూచిన కీడు గలుగును. తెలుపువన్నెగల వస్తువులనుజూచిన లాభము. చిరకాలము లోననే కలుగును. నల్లని భూమినిగాని వస్తువులనుగాని చూచిన నష్ట

ములు వచ్చును. దుర్గమభూమిలో విహరించుచున్నటుల కలగనిన కష్ట
ము ప్రాప్తించును. క్రూరజంతువులతోనున్న యరణ్యము గాన్పించిన
నాపదలు తప్పక కలుగగలవు.

జలసంబంధము—సుఖముగా సముద్రయానము సాగించి గమ్య
స్థానమును జేరినటుల కలగనిన నుద్యోగలాభము కలుగును. నిర్మలము
లగు నీరుగల తావుల జూచుటను మంచిది. నీరు మురికిగను మెరుపు
వర్ణమై యుండినట్లుగను యున్నతావులజూచిన తలచు కార్యంబులు
నాశనమగును. మురికినీటిలో చరణముల నిడినటుల కలగనిన కష్టములు
కలుగగలవు. నీటిని త్రాగుచున్నటుల కలగనుటవలన క్షేమము. నీటిని త్రాగు
టకుముందు పుక్కిలించి యుమిసినరీతిగా కలగనిన నాపదలువచ్చి దీరి
పోవును. నిండిన చెరువుమధ్యమున తామరాకున భోజనము సేయుచు
న్నట్లు కలగన్న రాజ్యము లభించును. తరంగములు అలలు లేని చెరు
వులుజూచిన మంచిది. నీటిలో నీదుచున్నట్లు కలగనుట మంచిది. తల
నీటిలోనుంచి యీదుచున్నటుల కలగనుట కష్టములు కలుగుసూచన.
తల నీటిపైనుంచి యుత్సాహముతో నీదుచున్నటుల కలగనిన విశేష
ముగా గలుగును. నిర్మలమగు నీటిపై ప్రయాణ మొనర్చుచున్నటుల
కలగనుట మంచిది. తాను ప్రయాణ మొనరించుచున్న పడవగాని నావ
గాని మునిగినటుల కలగనిన నాపదలు కలుగును. నీటిని మూటగట్టి
నటుల కలగనినను అసాధ్యపు పనులను నీటితోజేసినరీతి కలగనినను
యాపదలు కలుగును.

అగ్నిసంబంధము—తరుచుగా నగ్నికీలలలో జూచువారలు కో
పము గలవారగుదురు. పొగలేనినిప్పునుజూచుటమంచిది. పొగతో గూ
డిననిప్పును జూచుటవలన ద్రవ్యహాని యగును. బొగ్గులు బూడిద ము
న్నగునవి కాన్పించిన విచారము కలుగును. దీపముల తానుపట్టుకొను
నటుల కలగనిన శత్రునాశనమగును. ఇతరులు ప్రకాశమానమైన దీప

ముల పట్టుకొనిన శత్రువులు శిక్షనొందక తప్పించుకొనగలరు. దీపములు ప్రకాశవంతములు కాకున్నచో రోగప్రాప్తి. ఆరిపోయినటుల కలగనిన గొప్పనష్టము కలుగును. తాను వెలిగించిన దీపములు ప్రశాంతములయినచో సుపుత్రుడు కలుగును. తాను వెలిగించిన దీపము మాటిమాటికి నారిపోవుచున్నటుల కలగనినలాభము. పొగగలిగిన యిండ్లు కాలుచుండ చూచుటమంచిదికాదు. ద్రవ్యహానికలుగును. తన యిల్లు కాలుచున్నటుల కలవచ్చిన నిక్షేపము నష్టము ఇంటిలో పడకటిల్లు కాలుచున్నటుల కలవచ్చిన యజమాని మరణించును. వంటయిల్లు కాలుచున్నటుల కలగనిన వంటచేయువారి కాపదమూడును. ఇంటియందలి యేభాగము కాలుచుండునో యాభాగమున పనిచేయు వారలకు రోగప్రాప్తి కష్టములు కలుగును. తనబంధువులు బట్టలుగాని హితులబట్టలుగాని మండుచున్నటుల కలగనిన వారలకు రోగప్రాప్తియగును. తనబట్ట లంటుకొనినటుల కలగినిన తనకే వాత్స్యము కలుగును. తనచేయిగాని వ్రేలుగాని కాలుచున్నటుల చూచిన తాను దుర్మార్గము లాచరింపబోవుచున్నటుల నెఱుంగవలయును. ఇతరుల బట్టలు కాలుచుండగా జూచి తా నార్పినట్లుజూచిన పరోపకారప్రాప్తి కలుగును. తాను పరున్నమంచము మున్నగునవి గాలుచున్నటుల జూచిన గొప్పనష్టము కలుగును. స్త్రీకి యీ కలవచ్చిన వైధవ్యమో లేక మరణమో లేక గొప్పరోగమో కలుగును. దేశమంతయు కాలినటుల జూచిన యంటురోగములు దేశమున ప్రబలముగా వ్యాపించును. ధాన్యరాశి తగులబడుచుండ జూచిన పంటనశించును.

గాలిసంబంధము—పరిశుభ్రమైనగాలి వీల్చుచున్నటులకలగనిన లాభము. రోగులీ కలగనిన రోగనాశనమగును. బంధుమరణమగును. పెనుగాలితోగూడిన వర్షమున్నటుల కలగనిన వ్యవసాయదారునకు పంట నాశనము యితరులకు గొప్పనష్టము. గాలిలేకుండ చిన్ని చిన్ని

చినుకులు పడుచున్నటుల కలగనిన వ్యవసాయదారులకు మంచిలాభము కలుగును. యితరులకు గొప్పలాభము. గాలిచక్రములు మున్నగు వానిని గనిన కొన్ని కష్టములు గలిగినపిమ్మట లాభము చేకూరును. పరిశుభ్రమైనగాలిలో నాడుకొనుచున్నటుల చూచిన అభివృద్ధి కలుగును. దుర్వాసనగల గాలిని పీల్చుచున్నటుల చూచిన రోగము గలుగును.

గగనసంబంధము—నీలవర్ణముగల యాకాశమును చూచిన లాభము. కార్యసిద్ధి కలుగును. శత్రులజయించి స్థిరకీర్తి నార్జించును. ఆకసము తెల్లమబ్బుతో నిండియున్నటుల కలగనుట మధ్యమము. నల్లని మబ్బుగల యాకాశమును చూచుటవలన చెరుపు గలుగును. ద్రవ్యహానియగును. శత్రునకు పాదాక్రాంతుడగును. ఆకసమును సంజకెంజాయలలముకొనినటులస్వప్నమున చూచిన రోగప్రాప్తి, అవివాహితకన్యలకు త్వరలో వివాహంబగును. ద్రవ్యవంతులకు ధన నష్టము వర్తకునకు వ్యాపారనష్టము కలుగును. పంచవర్ణయుతమగు నాకసమును చూచుటమంచిది. ప్రకాశమైన సూర్యబింబమును చూచుట లాభము. తీక్ష్ణతేజమును ప్రాగ్దిశయం దుదయించుచున్నట్లు చూచిన లాభము. జయము. సూర్యుడు పశ్చిమమున నుదయించుచుండునటుల జూచుట చెడుగు. సూర్యుడుదయించి క్రమక్రమముగా పైకెక్కు చుండుట లాభము. రోగుల కారోగ్యము, కన్యలకు వివాహము, వర్తకులకు ద్రవ్యలాభము భూపాలురకు శత్రువిజయము కలుగును. సూర్యోదయమును కలలోగాంచిన స్త్రీలకు పుత్రోదయమగును. సూర్యమండలము ప్రకాశమైయున్న మేలు. సూర్యుడు గుడిగట్టినట్లు చూచుట చెడుగు. సూర్యమండలముపై మబ్బులావరించియుడిన చెడుగు. నల్లమబ్బు దిట్టముగా నావరించియున్నట్లు చూచిన గొప్పకష్టములు రాగలవు. సూర్యుడు నక్షత్రములవలె నేలపై బడుటగాని, క్రిందకు దిగు

టగాని యిట్టి యసాధ్యములు జరుగుటను కలలోచూచిన కీడువాటి ల్లును. తానున్న ప్రదేశమంతయును సూర్యరశ్మిచేనావరింపబడినట్లుల కలగన్న లాభము కలుగును. అచ్చటచ్చట నీడలున్నట్లుల కలగన్న కొన్నికష్టములు వచ్చునని భావించవలయును. మిక్కిలియెండలో నడచుచున్నట్లుల కలవచ్చిన లాభము. చెట్లనీడలో నడచుచున్నట్లు కల వచ్చిన కీడు. సూర్యగ్రహమును జూచుట మెరుపు. చోరులకు లాభ కరము. మూలింత రాత్రి కలగన్న సుపుత్రుని బడయుగలరు. ఎర్రని సూర్యమండలము గనుగొన్న హానికరము. చోరులకు త్తమము.

చంద్రుని దిలకించుట లాభము. వర్తకులకు ద్రవ్యలాభము. స్త్రీల కనుకూలదాంపత్యము. చంద్రునిపై తెల్లని మబ్బులున్నట్లుల దిలకించుట కష్టసూచకము. నల్లని మబ్బులున్నటులగాని గ్రహము పట్టి నట్లుగాని చూచిన రోగప్రాప్తి. వర్తకులకు నష్టము. ధనవంతులకు చోరులవలన నష్టము. రాకాసుధాకర దర్శనము లాభకరము. క్షీణ చంద్రుని దిలకించుటవలన నష్టములు కలుగును.

నక్షత్రదర్శన మభివృద్ధికి మూలకము. ఇంద్రధనువును చూచిన మంచిది. తూర్పుదిక్కున నింద్రధనువును చూచిన ధనవంతునకు నష్టము. పడమటనున్నట్లు చూచిన లాభము. తన తలపైనున్నట్లు జూచిన ధనవంతులకు దరిద్రము కలుగును.

జంతుసంబంధము—కుక్కలను కలలో చూచుటవలన ద్రవ్య లాభము. తెల్లకుక్కలను చూచుట మంచిది. నల్లకుక్కల చూచిన కీడు. ఎరుపైనకుక్కలను జూచిన కార్యసిద్ధి. కుక్క తన్నుజుట్టి తనతో తిరుగుచున్నటుల కాంచిన మిత్రలాభము. పదిపండ్రెండు కుక్కలు తనవెంట తిరుగుచున్నటుల చూచిన యాపదలు గడచును. కుక్కలు తన్ను చూచి మొరుగుచున్నటుల కలవచ్చిన బంధువులతో విరోధము కలుగును. తన్ను కరచినటుల కలగనిన కీడు. తన్ను కరచిన గాయమ్ము

నుండి నెత్తురుగారుచున్నటుల కలగన్న గొప్పరోగము కలుగును. ఇతరుల కరచినటుల కలగనిన యితరులకు కీడు. చక్కలను, తోడేళ్ళను చూచుట వలన చెరుపు గలుగును.

వానరములను కలలోగాంచిన కీడు వాటిల్లును. తానొక వానర మరుదెంచుచున్నటుల కలవచ్చిన తానొకనిచే మోసగింపబడును. కోతుల సహాయమున సింకొకరితో పోరుచున్నట్లు కలవచ్చిన జయము. వానరములు తమలోతాము పోట్లాడుకొనుచున్నట్లు కలగన్న మంచిది.

మేకలను గొర్రెలను కలలో గాంచుటవలన లాభము కలుగును. ఎనుబోతులను, గేదెలను చూచుటవలన కీడు వాటిల్లును. ఎనుబోతు నెక్కినట్లుగాని, ఎక్కి దక్షిణదిక్కుగా బోవుచున్నట్లుగాని కలవచ్చిన కాలము సమీపించెనని తెలియవలయును.

తెల్లఆవును కలలోజూచుట మంచిది. ఆవుపాలను పితుకు చున్నట్లు కలగన్న జాడ్యము కలుగును. ఇతరులు గోక్షీరంబుల దీయు చున్నట్లు కలవచ్చిన కీడు. గుర్రములను కలలోజూచుట మంచిది. గుర్రముపై స్వారీచేయుచున్నటుల కలగన్న బంధుదర్శనమగును. స్వారీ చేయుటలో క్రిందబడిన నుద్యోగభంగమగును. ఇతరులు పడినటుల కలగన్న తనకు లాభము.

గాడిదను చూచుట మంచిది. బరువు మోయుచున్నట్లు కలగన్న తనకు కష్టముగలిగిన యది తీరునని యూహించుకొనవలయును. బరు వుమోనున్న గాడిదను తాను తోలుకొని పోవుచున్నట్లు కలగన్న ద్రవ్య లాభము కలుగును. గాడిద నెక్కినట్లుగాని, గాడిదలపై బండినుంచి గూర్చుండిగాని పోవుచున్నట్లు కలగన్న మరణము గలుగునని యెరుంగ వలయును. ఒంటెలను కలలో జూచుటవలన పెక్కు కష్టములు గలిగి

నను తుదకు జయము కలుగును. ఏనుగును జూచుటవలన గొప్పలాభము. ఏనుగును నెక్కినట్లు కలగనిన రాజయోగము నొందగల కుమారు లుద్భవింతురు. ఘాతుకమృగములను కలలో జూచుటవలన గొప్ప కష్టములు కలుగును.

క్రిమికీటకసంబంధము—చీమలబారు చూచిన ప్రయాణము కలుగును. చీమలబారు చెదరిన నష్టము ప్రాప్తించును. చీమలను తాను గాని యితరులుగాని త్రొక్కుచుండగా జూచుట కష్టములు వచ్చునని సూచనగా నెరుంగవలయును. రోగగ్రస్తులు చీమలుచూచిన రోగము త్వరలో మానునని యెరుంగవలయును. ఎక్కలపురుగులు గాన్పించిన కీడు. రోగులకు త్వరలో నారోగ్యము కలుగును. తేనెటీగలచే కరువ బడినట్లు కలగనుటవలన కీడు. తేనెటీగలజూచిన లాభము. పాములను తేళ్ళను జూచుట మంచిది. పాము తనయింటిలో ప్రవేశించుట జూచిన కీడు. పాము తన్ను కరచినట్లుగాని, తన అవయవముల జుట్టియున్నట్లు గాని జూచిన రోగప్రాప్తి. కుందేలును చూచిన బంధుదర్శనము, ఎలుక లను జూచిన చెరుపు.

పక్షులసంబంధము—పక్షులనుగాంచినమంచిది. అవిఎగురుచుండగా జూచుట ధనవంతులకు కీడు. దరిద్రులకు ద్రవ్యలాభము. గ్రుడ్లతో నిండిన గూడు దొరకిన లాభము. గూటిలో గ్రుడ్లు లేకున్న కష్ట మూలము. కాకులు కనిపించిన కీడు. కాకి తననెత్తిపయి దన్నినట్లు కలగన్న మరణ మాసన్నమైనట్లు తెలియవలయును. కొంగలను, కౌజు లను, పిచ్చుకలను చూచుట మంచిది. వాని పోరాటము కష్టసూచకము. పావురమును చూడ మంచిది. నెమలిని చూచుట మంచిది. పుణ్య ప్రాప్తి, చిలుకలు గాన్పించిన దూరదేశప్రయాణంబును, లాభమును కలుగును. చక్రవాకదర్శనము లాభము గుడ్లగూబను జూచిన దుఃఖము గ్రద్దనుచూచిన చోరభయము.

## వివిధ విషయములు

అన్నమును కలలో గాంచుటవలన లాభము. తాను భుజించినటుల కలగనుటవలన దోషప్రాప్తి. యితరులు తినుట చూచిన మంచిది. ఇతరులకు తాను పెట్టుచున్నటుల కలగనుట మిగుల మంచిది. దుంపలను జూచిన వీర్యవంతుడగును. కాయకూరలు చూచుట మంచిది. ఉప్పు, పత్తి, మజ్జిగ, కలలో గనిన నాశనము కలుగును.

ప్రసూనములు స్వప్నంబున చూచుటవలన లాభము. పువ్వులను ధరించినటుల కలగన్న సిరి కలుగును. పుష్పాపచయ మొనర్చుట మంచిది. పూవు వాడినయెడల నష్టము. బంగారమును చూచిన లాభము. వెండిని చూడకూడదు. రాగి చూచిన దైవభక్తి కలుగును. మిగిలిన లోహముల చూడరాదు. అమేధ్యమును తొక్కినటుల కలగనుట మంచిది. ఒడలికి పూసికొనునటుల కలగనిన ద్రవ్యలాభము. ఒడలికి పూసికొనిన యశుద్ధమును కడుగుకొనినటుల గనుటవలన ద్రవ్యలాభముకలిగియు, నష్టము వచ్చుననుమాట. అశుద్ధముపై నిలిచినటుల కలగనుటవలన సంతానలాభము చేకూరును. సిరి కలుగును. సంగీతము వినుట యశుభము. తాను పాడిన రోగప్రాప్తి. వేదవాక్యములు వినుట మేలు.

ఇది స్వప్న భాగము.



# హస్తసాముద్రికము



## పురుష సాముద్రికము

పురుషునకు పలువరుసయు, వ్రేళ్ళును, హృదయమును, కనులు మిగుల తెలుపుగ నుండవలయును. వ్రేళ్ళగణుపులు, రేఖలు, దంతములు, గోళ్ళుచర్మము, మృదువులై పలచబారియుండు టుత్తమము. పురుషునకు గండభాగములు. భ్రూయుగము కనుదోయి తుదలును శిరోజములు మిగుల నలుపుగలవై తుమ్మెదరెక్కల బోలియుండవల

యును, చేతులు, తాలువులు, పాదములు, కన్నులు, స్తనములును, నాలుక, గోళ్ళు, అధరోష్ఠము యెఱ్ఱనై యున్న పూరుషుడు సకలభోగములననుభవించును. రోమ్ము, ముక్కు, భుజములు, ముఖము, శిరము ఫాలభాగము చేతులు, పృష్ఠము, అంసములు, చరణములు, వక్షస్థలము, విశాలముగనున్న మిగుల శుభము. దీర్ఘమైన బాహువులు, చక్కని విశాలవిలోచనములు, సుందరమైనను పొడవుగల్గియున్న సప్త భోగములను చేకూరును. సత్వమును, నాభియును, సర్వమును గంభీరమై యుండవలయును. యురిస్తంభంబు నాలుకయు, మోము, మిక్కిలి విస్తీర్ణము కలవిగానున్న పురుషుండు ఉత్తముండనబరగును. మెత్తని చేతులును పాదములును కలవాడు స్థిరకార్యములు లోపర్పగలడు. పాదములు వెడలుపు గలవియై తెల్లబడిన గోర్లుకలిగి తెలుపు మెరుపుగలిసిన రంగుగల పాదములుగలవాడు దర్రిదముతో పీడింపబడుచుండును. అన్నివ్రేళ్ళకంటెను పెద్దవ్రేలు పొడవైనవాడు మధ్యనుండు చిటికెన వ్రేలు పొడువైనవాడును రిక్తుడగును. వికృతరూపంబు గలిగిన వ్రేళ్ళు గలవాడు వెర్రివాడగును. ఎర్రని గోళ్ళుగలవాడు ధరణీశుడగును. వంకర గలిగిన వ్రేళ్ళుగలవాడు నిర్భాగ్యుడగును. వలయాకారము గలిగిన జంఘలు గలవాడు వీర్యవంతుడను.

శుష్కించి యెండువారిన జంఘములుగలవాడు చోరుడగును. వంకరగలిగిన జంఘలు కలిగినవాడు సిరులుబాసి దర్రిదముచే పీడింపబడును. మోకాళ్ళు మాంసరహితములై శుష్కించిన యెడల మరణమొందును. మోకాటిచిప్పలు పొట్టివైనచో భోగశాలియగును. మోకాటి చిప్పలు పెద్దయైన దర్రిదవంతుడగును. నల్లనిరంగు గలిగిన గోళ్ళుగలవాడు రోగిష్టియగును. శిథిలమైన గోళ్ళుగలవాడు దర్రిదుడగును. అవయవములు గూఢములైనచో ధరణీశుడగును అయ్యవి

బహిర్గతములై యున్నచో దుఃఖకరములు, మిగుల వక్రమునవై యున్నచో సిరులుకలుగును. ఒంటిపిచ్చగలవాడు అల్పాయుర్దాయముకలవాడగును. రెండుపిచ్చలును సమముగ లేనివాడు జారుడగును. పెద్దయైనచో దీర్ఘాయుష్మంతుడగును అణగిమణగియుచిన్నవియునైనచో నల్పాయువగును నిశ్శబ్దమైన మూత్రధార కలిగినవాడు కష్టజీవియై దరిద్రావస్థ జెందును. ఒకటే ధారగలిగిన పుత్రవంతుడగును. ఏమనుజుని శుక్లంబు తేనెవాసన కలిగియుండునో యామనుజుడు భూపాలుండగును. చేపల వాసనగల శుక్లంబుగలవాడు పుత్రవంతుడగును. మాంసముయొక్క గంధముగలిగినవాడు భోగభాగ్యముల ననుభవించుచుండును. ఉప్పు వాసనగలిగిన వాడైనచో దరిద్రుడగును. క్షీరసుగంధముగలవాడు దీర్ఘాయువు గలవాడగును. తెలుపులేని శుక్లముకలవాడు సంతానహీనుడగును. శుక్లము నీటిపై తేలుచుండినయెడల సంతానవంతుడగును.

ఉదరమున నొక మడతకల్గినవా డాయుధములచే దెబ్బలుతిని బాధనొందును. రెండుమడతలుకలవాడు భోగశాలియై స్త్రీలోలుడగును. మూడుమడతలు కలవాడైనచో సౌఖ్యముగ జీవనమును గడుపుచుండును. నాలుగు మడతలు కలవాడు నీచుడగును.

సింహమునుపోలిన కటిప్రదేశముకలవాడు మనుజేంద్రుడగును. ఏనుగు కటిబోలిన కటిప్రదేశము కలవాడు భూపాలుడగును.

రోమహీనమైన మిత్రపల్లములు లేక సమానముగాయున్న వీపు గలవాడు విత్తవంతుడగును, శేషముగలిగిన మిత్రపల్లములున్నయెడల సిరిగలుగును.

మిగుల పొడవుకలిగి పుష్టికలిగిన పుష్టులేనట్టి వ్రేళ్ళులేకయున్నత బాహుయుగములుండుట మేలు. పురుషునియొక్క మణిబంధమున మూడు రేఖలుండుట యుత్తమము. భూపాలుడగును.

శుష్కించిన నాశిక గలవాడు సుఖజీవియగును. దీర్ఘమైన నాశిక గలయువాడు దీర్ఘాయువు కలవాడగును. చిన్న నాశికయైన కీడుమూడును. ఖండింపబడిన అగ్రముకల నాశికకలవాడు ఉచితమైన కర్మలజేయును.

కనుకొలకులయందు రక్తముకలిగి పద్మదళంబుల కాంతిగలిగి యున్న నేత్రంబులుండుట శ్రేష్ఠము. పిల్లికండ్లబోలినకండ్లుగలవాడు నిర్భాగ్యుడగును. ఏనుగునేత్రములబోలు నేత్రంబులుగలవాడు సమూకాంతుడగును. నీలోత్పలములబోలిన నేత్రములుగలవాడు యెల్లరిచే బూజింపబడును. కనురెప్పలు వాల్చునపుడు నొకమాటును రెండుమార్లును యొక్కతడవకు వాల్చిన సుఖమును, ధనమును కలుగును. మూడునాలుగుమార్లు కనురెప్పలు వాల్చువాడైనచో దరిద్రుడగును.

ఉదరమున నొక్కసుడియున్న గొప్పవాడగును. రెండుసుళ్ళున్న కుమతి యగును. మూడుసుళ్ళున్న భోగియగును. నాలుగుసుళ్లున్న పరులబాధించు పాపబుద్ధి యగును.

కనుబొమ్మలు రెండును విషమమైన యెడల సిరిసంపదలు గోలుపోలు దరిద్రుడగును. పొడుగుగా నున్న యెడల సిరి గోలుపోవును. బాలచంద్రునివలె నర్ధచంద్రాకృతిగల్గిన భోగి యగును. కనుబొమ్మల మధ్యభాగము వంగియున్నయెడల బాలిశుడగును. ఫాలభాగమున రెండు రేఖలున్న నలువదివత్సరంబులు జీవించును. మూడు గీతలున్నయెడల నరువది సంవత్సరములు జీవించును. నాలుగురేఖలున్న ఎనుబది సంవత్సరములును జీవించును. అయిదుగీతలున్నయెడల పూర్ణాయుర్దాయము కలవాడగును.

ఒక్కొక్క రోమకూపమున నొక్కొక్కరోమకూప మున్నయెడ అధికారి యగును. రెండురోమంబు లొక్కకూపమున బుట్టిన ధనవంతుడగును. మూడునాలుగుగ్గురు రోమంబు లొక్కకూపమునందు బుట్టిన

దరిద్రుడగును. ముప్పదిరెండుదంతములుకలవాడు మిక్కిలి ధ నవంతుడగును ముప్పదిరెండుకంటె తక్కువదంతములుగలవాడు మిగుల సౌఖ్యవంతుడగును ముప్పదిదంతములున్న నాతడు మిక్కిలి బలశాలియగును. ఇంతకన్న తక్కువ దంతములుకలవాడు దరిద్రుడగును.

కాలిబొటనవ్రేలినుండి శిరంబుయొక్క కొనవరకు కొలచిన దారము జానతో 7 జానలుండవలయును ఎక్కువయున్న శుభము. ఆదారమునందు సగము బొక్కిలివరకునుండిన సమమైన దేహముకలవాడగును. పై భాగము పొడవుగలదైనచో శౌర్యనిధియగును. తక్కువ గలవాడు చురుకుగ నడచువాడును, తాబేటిచిప్పనుబోలిన మోకాటి చిప్పలు కలిగినవాడును పాదములు వేడిగా నుండువాడును, లోకులచే పూజింపబడుదురు. సూర్యోదయ సూర్యాస్తమయములందు నిద్రించు వాడును జీవహింసచేయువాడును రహస్యముగా పాపకార్యము లాచరించువాడును నిర్దయస్వభావముకలవాడును దుఃఖజీవన మొనరించుచుందురు.

గడ్డమువచ్చిన పిమ్మట మీసము వచ్చు నాతని కల్పాయువగును. మీసములు వచ్చిన పిమ్మట గడ్డము వచ్చినవాడు దీర్ఘాయువు కలవాడగును.

## స్త్రీ సాముద్రికము

భూమిపై పాదమునంతయు నాని నడచు స్త్రీ యుత్తమురాలు. పుడమిమీద నానని వ్రేళ్ళుగల కాంత దరిద్రిణి యగును. అరికాళ్ళు భూమిపై పూర్తిగా నాననియెడల నా సతి జారిణి యగుట నిక్కము. మిగుల శుష్కించిన కటిప్రదేశముకలది పతిని సంహరించును. మిగుల కురుచయైన యంగములుగలకాంత సిరులతో తులతూగును. పల్లము లైన గుంటభాగములుగలకాంత పతినాశనకారిణియగును. మిగుల

సద్దముగా బలిసియున్న కాంతవలన సర్వహాని సంభవించును. అంటు పిక్కలుగలిగిన కాంత పుట్టింటివారి యైశ్వర్య మడచును. పురుషుని వలె మాటలాడునామె బంధునాశనము గావించును. పిక్కలపై రోమములు లతి దట్టముగ నున్న కాంత వైధవ్యము నొందును.

అంగుళ్ళ వ్రేళ్ళు గలిగినపడతి పతిని సంహరించును. నడచునప్పుడు భూమిరేణుక్క పరాగముపై కెగజిమ్మినట్టి కాంత విధవయై పిమ్మట కులటయగును. ముడికాళ్లు గలిగిన కాంతయు, నడచునప్పుడు శబ్దము కలిగించు పడంతియు జారిణులగుదురు.

కోపరేక తోరణరేక పంకజరేక కూర్మరేకలు మున్నగునవి కలిగి మృదుతరమైన హస్తములుగలకాంత భూపాలునకు పట్టపురాణి యగును. పలుచనికమపును బలసిన జంఘలును గలిగినకాంత పుత్రవంతురాలగును. కంఠమునందు శంఖునకువలె మూడు రేకలున్న యెడల నాకాంత సత్స్వభావముకలదై యిరువంశంబులకు యశంబుచేకూర్చును. నిమ్నభాగమున దక్షిణమునుండి సుడితిరుగు నాభికలిగినకాంత సుఖించును. నాభి మిగుల పెద్దదిగాను కానుపించి రోమంబులు గలిగి యున్న కాంత విధవయగును. ఏనుగుతొండమునుబోలిన యూరులును మావేడుపత్రమునుబోలిన యోనియు తాబేటినిబోలిన పిరుదులును గలిగినకాంతను పరిగ్రహింపవచ్చును. జంఘలెప్పుడును సమానముగాను రోమములు లేనట్టివిగాను అయియుండవలయును. అట్లువి రోమయుక్తములయిన నాకాంత దుర్భరయగును. జంఘపై పెద్దనరము కానుపించిన కాంత విధవయగుట నిక్కము.

మిక్కిలి పొడవైన, మిగుల కురచయైనను, మిగుల కృశించిన శరీరముగలదైనను మిగుల లావుగలిగినదైనను మిగుల నలుపైన శరీరకాంతి కలిగినదైనను మిగుల నెరుపైన కాంతియైనను మిగుల మాటకలదియైనను ఏమి చేకూర్చును. అట్టికాంతలను పరిగ్రహింపరాదు.

ఇంక నావర్తప్రకారం బెట్టిదనిన—స్త్రీలకు దేహమున దక్షిణ భాగమున కుడిచుట్టు గలిగిన నెనమండ్రు సుతులుగని సుఖించును. ఏవని తకు భగమున కుడిచుట్టు కలిగిన సుడియుండునో యాకాంత సంపద లను సుఖములను బొందగలుగును. కటిభాగమున సుడియున్న కాంత మూరుగురు పుత్రులను సైతము బోగొర్చును. వెన్నునందును చెవి కొలకులయందును శిరమునందును సుళ్ళు గలిగినకాంత పతిని సంహ రించును.

శిరమున సుడియున్నకాంత సిరులు నాశనముచేయును. ఫాల భాగముల సుడియున్నకాంత మరదిగారియొక్క యైశ్వర్యము పాడు జేయును. కర్ణముల కొలకులయందు సుడియున్నయెడల ప్రాణనాథుని సంహరించును. కనుబొమ్మలయందు సుళ్ళున్నకాంత దుర్వ్యసనము కలిగించును. మెడపయి సుడియున్నకాంత భర్తయొక్క సౌఖ్యము చెరచును. భుజములపయి సుడియున్నకాంత జారిణియగును. శిరోజముల సుడియున్నకాంత వారాంగనయగును. కడుపుపై సుడియున్నకన్య మామగారి యింటిభాగ్యమును నశింపజేయును. పాదములయందు సుడి గలిగినకాంత వేశ్య యగును.

ముచ్చిలిగుంటపట్టున సుడియున్నకాంతను పరిగ్రహింపరాదని సాముద్రికాగమజ్ఞానిధు లుపదేశించుచున్నారు.

స్త్రీలకు కుడిప్రక్కనున్న భాగములు ఎడమప్రక్కనున్న యంగ ములకంటె చిన్నవిగ నున్నయెడల మేలు చేకూరును. యాకాంత యధికములగు భోగభాగ్యము లనుభవింపగలదు.

ఏకాంతామణి ఫాలభాగమున భ్రూమధ్యమమున నొక్క మచ్చ యుండునో యా కాంతాశిరోమణి, చతుస్సముద్రముద్రిత ధరావల యము నేలు భూపాలునకు పట్టమహిషియగును. కుడికపోలభాగమున మచ్చయున్న సంపదలు తులతూగుచుండును. ఎడమ కుచంబుమీద

ఎరుపుకాంతిగలిగిన మచ్చయొకటి యున్నయెడల నాకాంతయొక్క కుమారునిగని నాథుని యమలోకమునకు బంపును. ఏతరుణీలలామకు గుహ్యసీమయొక్క నడిభాగమున నక్షత్రమువలె నొకమచ్చ యున్న యాకాంత భూపాలునకు దేవియై భూవలయాధినాథుండగు కుమారుని బడయగలదు. ముక్కుమీద నెర్రనగు నొక మచ్చయుండిన రాజకాంత యగును. ఆ నాసికపై నున్న మచ్చ నల్లనిదైన పతిని హరించి వేశ్య యగును.

## సాముద్రికము

హస్తసాముద్రికము పురుషునకు కుడిచేయియందును, స్త్రీలకు ఎడమ చేయియందును సాముద్రికాగమవేదులుగాంచి ఫలాఫలంబులను నిర్ణయింతురు. ఎల్లరకు (స్త్రీపురుషాదులకు) కుడిచేయికంటె నెడమ చేయి కొంచెమధికముగా నుండును.

మణికట్టునందు 4 కంకణరేఖలున్న పురుషుడు భూపాలుడగును. మూడు రేఖలు గలవాడు భోగియగును. రెండు కంకణరేఖలు కలిగిన వాడు సామాన్యుడగును. ఒక్క కంకణరేఖయున్న బీదవాడగును. నాల్గు కంకణరేఖలున్న స్త్రీపట్టపురాణి యగును. మూడు గలిగిన భూషణము లధికముగా దాల్చును. రెండు రేఖలున్నచో సామాన్యము ఒకటిమాత్రమే యున్న బీదయగును.

బొటనవ్రేలికి రెండు కణుపులును, మిగిలిన నాల్గు వ్రేళ్ళకును నైదేశి కణుపులును యుండును. బొటనవ్రేలు పొడవైనవాడు శిల్పి యగును. చిటికెనవ్రేలు అనామికాంగుళముయొక్క మూడవకణుపులు దాటియున్నయెడల సిరిసంపదలును, పౌరుషము కలిగియుండును. బొటన

వ్రేలి మొదటికణుపు మధ్యమమున చతుష్కోణాకృతిగ నొక్కరేఖ యుండును. ఆ విషమచతుష్కోణరేఖ కలవాడు ధనవంతుడగును. దానిపై నక్షత్రములున్న ఫలము జూపట్టదు. బొటనవ్రేలి కణుపుల మొదటి భాగమున సర్పరేఖలుండును. ఆ సర్పరేఖల మధ్యమమున ధాన్యపుగింజవలెను, గోధుమగింజాకృతిగను రేఖలుండును. మిగిలిన నాలుగు వ్రేళ్ళయందును గూడ నట్టియవరేఖలుండును. ఇట్టిరేఖలు గలవాడు మృష్టాన్నభోజనము సేయువాడును. సిరిసంపదలు గలిగి యుండువాడును నగును. వ్రేళ్ళకొనలయందు శంఖుచక్ర అంకరేఖలుం డును. ఒక్క కలశరేఖయున్నవాడు ప్రగల్భుడగును.

తర్జనీమధ్యమ అనామిక కనిష్ఠికాంగుళముల కణుపులందునాలు గేసి పొడవైనరేఖలు నిలువునయుండును. ఒక్కొక్కకణుపున నాలుగేసి పొడవురేఖలుండిన నతిభోగవంతుడగును. మూడురేఖలున్న యెడల భోగియగును. రెండు రేఖలున్న సామాన్యుడగును. ఒక్కొక్కరేఖయే యున్న యెడల సన్యాసియగును. అయిదు వ్రేళ్ళను చక్రములున్న భూపాలుడగును. నాలుగు చక్రములున్న రాజులచేగూడ పూజింపబడు వాడగును. మూడు చక్రములున్న యెడల లోకసంచారియగును. రెండు చక్రములు కలిగియున్నవాడు రాజులచే సన్మానింపబడును. ఒక్క చక్రమున్న భోగియగును.

వ్రేళ్ళకు జెప్పబడిన శుభలక్షణములన్నియు నుండిన జీవితకాల మంతయును సుఖముగా గడుపును. (జీవితము 100 సంవత్సరములు) జీవితకాలమును అయిదు భాగములుచేసి యొక్కొక్కవ్రేలియందు పైనజెప్పబడిన లక్షణములున్న నిరువదేండ్లు భోగయోగము గలుగు ననియు రెండువ్రేళ్ళపై నాలక్షణములున్న నలుబదియేండ్లనియు మూ

డు[వేళ్ళపై నాలక్షణమున్న నరువది సంవత్సరములు భోగించుననియు నాలుగు[వేళ్ళపై నట్టిరేఖలున్న యెనుబది వత్సరములు సుఖముగా జీవించుననియు, నూహింపవలసి యున్నది. బొటన[వ్రేలి మొదలు ఎన్నొవ [వ్రేలియందు శుభలక్షణములుండునో యన్ని సంవత్సరములు గడచిన పిమ్మట కష్టము కలుగునని యూహించుకొనవలయును.

చిటికెన[వేలుగాక మిగిలిన [వేళ్ళ[క్రింది రెండు రేఖలున్న యా పురుషుడు భార్యతో గూడి సర్వసుఖముల ననుభవించును. చిటికెన [వేలికడ నట్టిరేఖలున్న పురుషుడు బాల్యకాలముననే సౌఖ్యమను భవించును. ఆరేఖ కడ్డుగీతగ రేఖలున్న ఫలము శూన్యమగును. అనామిక[క్రింద రెండు రేఖ లుండిన విద్యావంతుడగును. వెనుకటివలె సమ్మ రేఖలుండిన ధనధాన్య స్త్రీభోగాదికములు గలుగును. తర్జని[క్రింద నట్టి రేఖ గీతలున్న కార్యలాభము. అడ్డురేఖలున్న ఫలము శూన్యము. రేఖలు స్వల్పముగా కనబడుచున్న ఫలమల్పముగానుండును. రేఖ లెంత స్ఫుటముగా నుండునో. ఫలమంత యధికముగా నుండును.

బొటన[వేలి మొదలునుండి యొకరేఖ బయలువెడలి తర్జనికిని బొటన[వేలికిని మధ్యభాగము జేరుచుండును. ఆరేఖకు పురుషరేఖయని పేరు. అరచేతిపార్శ్వమునుండి యొకరేఖ బయలువెడలి పురుషరేఖతో గలియుచుండును. ఆరేఖకు స్త్రీరేఖయని పేరు. పురుషరేఖయు స్త్రీ రేఖయు కలసియుండిన దంపతుల కన్యోన్యము సుఖముగా నుండును. కలువకున్న యెడల దాంపత్య మనుకూలముగా నుండదు. స్త్రీపురుష రేఖలకు అడ్డగీతలు తగిలినను స్త్రీపురుషరేఖలు కలవక దూరముగా నున్నను వివాహము కానేరదు. స్త్రీపురుషరేఖలు కలసి కొనదేరి ముందునకు సాగియున్న పుత్రులధికముగా కలుగుదురు.

నాశనము గావించును. అరజేతియందు పద్మరేఖ గలిగినవాడు సిరిసం పదల తులతూగుచుండును. ధనరేఖ సమీపమున శంఖురేఖ గలిగిన వాడు ఏనుగు లధికముగాగల భూపాలుడగును. పురుషరేఖ సమీప మున తోరణరేఖగలిగినవాడు దుర్జనులైన నరులచే జీవితుడగును. అర చేత చక్రముగలవాడు విష్ణుమూర్తితో సమానుడగును. అష్టకోణము త్రిశూలము, త్రికోణము, మనుజశిరంబు, ధనువు, సర్పము, ఖడ్గము, గద, త్రికోణాకృతిగల తటాకము మున్నగునవి కలవాడు భూకాంతు డగును.

ఏ పురుషుని యరచేతియందు లెక్కలేనన్ని రేఖలు నపసవ్యము లుగ వ్యాపించియుండునో యా పురుషుడు మిగుల కష్టముల నొంద గలడు. స్వల్పసంఖ్యాకమగు రేఖలున్నవాడు ధనశూన్యు డగును. ఎఱ్ఱనికాంతిగలిగిన రేఖలుగలిగినవాడు భాగ్యవంతుడగును. నలుపైన రేఖలు గలిగినవాడు భృత్యుడై యుండును. ఏ పురుషుని హస్తమున ఛత్రము, ధేనువు, అంకుశము, జండా, దండము, శస్త్రము, వృషభము భద్రపీఠము, పద్మములు, చక్రము, కలశము, చాపలు మున్నగువానిని బోలిన రేఖలుండునో యాతడు భూవలయమునంతను పరిపాలించును.

ఏ పురుషుని హస్తమున తాబేలు, పద్మము, విల్లు, చామరము గొడుగు, కుండలములు మున్నగువానిబోలిన దివ్యరేఖలు గల్గునో వాడు దీర్ఘాయువు కలవాడగును.

శంఖము, పద్మము, ఛత్రము, చామరము, ధ్వజము, చేప వజ్రము, కరము, కలశము, ఏనుగు మున్నగువానిబోలిన రేఖలుండిన యెడల భూపాలు డగును.

విల్లమ్ములు, చక్రము, ఖడ్గము మున్నగు రేఖలు గలిగినవాడు శౌర్యవంతుడై పురుషార్థములవలె సుఖించును. స్త్రీపురుష రేఖల మధ్యభాగమునందు అష్టకోణము, త్రిశూలము, అరుగు, మనుజునిశిరము, వస్త్రము, ధనుస్సు, పాము, చూరికత్తి, పుస్తకము, వీణ త్రికోణము, వలయము, చెరువు, పాము, పశుపయునున్న గుఱ్ఱమంటి గుర్తు మున్నగునవి యుండవలయును. స్త్రీ రేఖకును ఆయురేఖకును నడుమ గోపురము చక్రము ధనువు మొదలగు రేఖలున్న శుభకరములు.

స్త్రీ ధనరేఖలందు మధ్యమున ప్రాకారము, హస్తిశిరము, గుర్రము, ఇల్లు; గ్రామము, ఢమరుకము, అంకుశము, కలశము, ఖడ్గము మున్నగు రేఖ లుండును.

ఏపురుషుని హస్తమున విష్ణురేఖయుండునో ఆపురుషుడు పుణ్యకార్యము లొనరించి ద్రవ్యవంతుడై పెక్కురు పుత్రుల బడయగలడు.

తులారేఖగలవాడును, గ్రామరేఖగలవాడును, రజ్జురేఖగలవాడును వర్తకవ్యాపారంబున వెలగుచు ద్రవ్య మపారముగా నార్జింపగలడు.

శంఖము చక్రము ధ్వజము మినుసగింజ మున్నగునవి చేరిన రేఖలు గల హస్తము గలిగిన పురుషుడు సమస్త విద్యలయందును పాండిత్యమును సంపాదించును.

హస్తమధ్యమున త్రిశూలరేఖ యుండిన దానధర్మాదికములయందు బుద్ధిగలిగి పుత్రవంతు డగును.

హస్తతలమున పర్వతము కంకణము యోని శిరము మున్నగు రేఖలుండిన రాజమంత్రి యగును.

బొటనవ్రేలిపై యూర్ధ్వరేఖలు సలక్షణముగ నున్నయెడల యా పురుషుడు సేనాధ్యక్షుడగును. కాని రణరంగమునందు దన ప్రతాపము జూపి కొలదికాలములోనే మరణించును.

బొటనవ్రేలుగాక తక్కిన నాలుగు వ్రేళ్ళయందును వ్రేలి యొకటికి మూడు రేఖలున్న ధనధాన్యసంపదలు కలుగును. ఆ రేఖ లన్నియు గలిసిన 13 అగునేని యాతని కనేక కష్టములు గలుగును. దుఃఖితు డగును. 14 అగునేని సకల సుఖవంతు డగును. భోగియగును. 15 అయినయెడల యాతడు చోరశిఖామణి యగును. 16 రేఖ లుండిన యాతడు జూదరియై ధనమంతయు గోలుపోవును. పదునేడు రేఖలుండిన జీవహింస చేయుచు పాపాత్ము డగును. 18 రేఖ లుండిన ధర్మాత్ము డగును. సుఖించును.

అయిదువ్రేళ్ళయందును 19 రేఖలు గలిగిన యాతడు పూజ్యు డగును. సుఖించును. 20 రేఖలు గలిగిన యాతడు దపోనియమంబులు కలిగి పుణ్యావర్తను డగును.

ఒక చక్రముండినయెడల సుఖించును. రెండు చక్రములుండిన యెడల రాజుచే పూజింపబడును. 3 చక్రములుండిన ధనధాన్యసంపద లధికమగును. 4 చక్రములుండిన దరిద్రుడగును. 5 చక్రములుండిన స్త్రీలోలుడై మెలగుచుండును. 6 చక్రములుండిన కాముకు డగును. 7 చక్రములుండిన శుభవంతు డగును. 8 చక్రములుండిన రోగిష్టి యగును. 9 చక్రములుండిన భూపాలు డగును. 10 చక్రములుండిన యాతడు యోగి యగును.

బొటనవ్రేలి మొదటనుండి రేఖలన్నియు సంతానసూచకము. అందున్న దీర్ఘముగా నున్న వన్నియును పురుష సంతానమును సూచించును. పొట్టిమెలికలు దిరిగినవి స్త్రీసంతానము లనియు తెలియవలయును. సంతానరేఖలకు పడ్డగీతలు తగిలిన సంతాననష్టము కలుగును. రేఖలు లేకున్నయెడల గర్భస్రావములు కలుగును. రేఖలు లేనియెడల గొడ్డువా డగును.

శుభరేఖలకు పడ్డగీతలు తగిలినయెడల అశుభయోగములు గలుగును. భంగమగును. శుభలక్షణ రేఖలన్నియును స్పష్టముగ గాన్పింపకున్న స్వల్పమగు శుభము చేకూరును.

సంపూర్ణము



శ్రీ కొండపల్లి ప్రెస్, రాజమండ్రి.

# పూర్వకవుల పద్య కావ్యములు

| | రు | అ |
|---|---|---|
| వసుచరిత్ర మూలము | 1 | 0 |
| డిటో తా॥ సహితము | 2 | 0 |
| డిటో టీకాతాత్పర్యసహితము కాలికో | 5 | 0 |
| విజయవిలాసము | 0 | 8 |
| మనుచరిత్రము | 0 | 12 |
| డిటో తాత్పర్యసహితము | 2 | 0 |
| డిటో టీకాతాత్పర్యము | [illegible] | [illegible] |
| రాజశేఖరవిలాసము | 0 | 8 |
| వైజయంతీవిలాసము | 0 | 8 |
| శశిరేఖాపరిణయము | 0 | 8 |
| శృంగారనైషధము | 1 | 0 |
| పాండురంగమాహాత్మ్యము | 1 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము | 0 | 12 |
| శతకరత్నములు 1 భా | 0 | 8 |
| డిటో 2 భా | 0 | 8 |
| స్తోత్రరత్నములు | 1 | 0 |
| సారంగధరచరిత్ర | 0 | 12 |
| పారిజాతాపహరణము | 0 | 12 |
| మొల్లరామాయణము | 0 | 12 |
| భక్తచింతామణి వ॥ కు॥ | 0 | 6 |
| కళాపూర్ణోదయము | 1 | 0 |
| డిటో సాణ్యంకాలికోబైండు | 2 | 8 |
| శృంగారశాకుంతలము | 0 | 12 |
| పట్టాభిరామాయణము | 0 | 12 |
| భాగవతము పద్యగ్రంథము (ప్రహ్లాదచరిత్ర) | 0 | 8 |
| డిటో కాలికోబైండు | 1 | 12 |
| రసికజనమనోభిరామము | 1 | 0 |
| భర్తృహరిసుభాషితము | 1 | 0 |
| డిటో సాణ్యం కాలికో | 3 | 8 |
| జైమినీభారతము | 1 | 0 |
| కుచేలోపాఖ్యానము (గట్టుప్రభువు) | 0 | 8 |
| నలోపాఖ్యానము టీకా | 0 | 8 |
| పంచతంత్రము | 0 | 8 |
| వేమనపద్యములు | 0 | 8 |
| డిటో తా॥ సహితం 300 పే॥ | 1 | 8 |
| డిటో పెద్దది కాలికో | 2 | 0 |
| ప్రభావతీప్రద్యుమ్నము | 1 | 0 |
| నీతిచంద్రిక | 0 | 8 |
| రామకర్ణామృతము | 1 | 0 |
| డిటో మేలుప్రతి | 2 | 8 |
| కృష్ణకర్ణామృతము | 1 | 0 |
| డిటో మేలుప్రతి | 2 | 0 |
| కవిశేఖర శిష్టా వేంకటసుబ్బయ్యగారి హృదయసాక్షిరామము (శృంగారప్రబంధము) | 1 | 8 |
| మానసరామాయణము | 1 | 8 |

